First Edition: 5000 copies
April 1960

# CHEPPUDU MATALU

and other Kannada plays in Telugu.

Compilers :
**SRIRANGA & N. KASTURI**

*Translated by :*
**T. RAMACHANDRA**

With the kind permission
of the Copyright holders

*Published under the auspices of*
**The Southern Languages Book Trust, Madras**
Telugu-53.

**PRICE Rs. 1-25**

*Published by :*
Adarsa Grandha Mandali, Vijayawada.

*Printed at:*
VICTORY PRESS, VIJAYAWADA

విజ్ఞానవికాసదాయకములైన భిన్నభిన్నవిషయాలను గురిం
చిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని,
ఆవిధంగా ఇట్టిప్రచురణలకు ముందుముందు విస్తారప్రచారం
కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నిం
టిని మిగిలిన దాక్షిణాత్యభాషలలోకి అనువదింపచేయటం
ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన
విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు విద్యా
వంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలనుగురించిన
జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి ఆ జ్ఞానపిపాసను తృప్తి
పరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అంద
జేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణభాషాపుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని
సఫలంకాగలవని ఆశిస్తున్నాను.

ఎ. యల్. మొదలియార్
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం

7-10-1958

# ఉపోద్ఘాతము

ఏకాంకిక ఆధునిక కన్నడసాహిత్యంలో వికసించిన ఒక నూతన సాహిత్యప్రక్రియ. ఒకదృష్టిలో చెప్పవలసి వస్తే సాహిత్యప్రపంచంలోనే ఏకాంకిక పూర్తిగా ఇటీవలి ప్రక్రియ అనవచ్చు. సంస్కృతనాట్యశాస్త్రంలోను, అదే విధంగా అనేకశతాబ్దాలుగా యూరపుఖండంలోను ఒకే అంకంలో రచితమైన రూపకాలు, ఏకాంకికవంటి చిన్న దృశ్యాలు కనిపిస్తాయి; వాస్తవమే. అయితే నేడు నాట్య కళాదృష్టిలో దేనిని మనం 'ఏకాంకిక' (One act ) అంటున్నా మో అలాటివి, ఆ దృష్టిలో ఏకాంకికలు గడచిన శతాబ్దం అంత్యభాగంవరకూ ఎక్కడా కనిపించవు. సంస్కృతంలో భాణం, వీథి, అంకం, వ్యాయోగం – ఈ నాల్గూ "ఏకాం కిక"లని నాట్యశాస్త్రంలో గ్రథితమైంది. కాని భాణంలోను, వీథిలోను రెంటికంటె హెచ్చు పాత్రలుండరాదు. భాణం సంభాషణరీతి ఆకాశభాషితంగానే ఉండాలి; అంకం ఇతి వృత్తం స్త్రీల శోకం; వ్యాయోగంలో స్త్రీనిమిత్తంకాని యుద్ధం; వీథిలో భూరిశృంగారం—ఈ వ్యాఖ్యలను చూస్తే, ఏకాంకమంటే చిన్న నాటకం, ఒక్క విషయం లేక విష యాంశంగురించిన నాటకం, తక్కువపాత్రల నాటిక – అన్నవిషయం అర్థమౌతోంది. ఇది నేటి ఏకాంకికకంటే భిన్నమైనది. కళాదృష్టిలో చూచినయెడల కేవల బాహ్య స్వరూపకల్పన అని వేరుగా చెప్పనక్కర లేదు.

నేడు మనం గుర్తించిన ఏకాంకిక అనేది ఏదృష్టిలోను నాటకంలో ఒకభాగం అని చెప్పలేము. తద్విరుద్ధంగా పెద్ద నాటకంలో ఉండవలసిన అన్ని అంగాలూ ఏకాంకికలో ఉండ వలసిఉన్నది. ఏకాంకిక స్వరూపమేమో నాటకంకంటె చిన్న దిగా ఉండాలనేది నిర్వివాదమైనవిషయం. మూడుగంటల సేపు – తెర ఒకసారికూడా పడక – రంగస్థలంపై నడిచే నాటకాన్ని ఏకాంకిక అనలేము; పదిహేనునిమిషాలు మొద లు ఒకగంట (ఎక్కువయితే గంటంబావు) అవధిలోపల ఏకాంకికాప్రయోగం సమాప్తంకావాలి. ఈ అల్పావధిలో ప్రయోగం విజయవంతంగా (అంటే ప్రేక్షకులను తల్లీను లనుచేసి) సమాప్తం కావాలంటే ఒక విశిష్టమైన కౌశలం ఉంటేనే సాధ్యం. పెద్ద నాటకాలలోవలె వివరాలు చెప్పడం సాధ్యంకాదు. అయితే ముఖ్యమైన వివరాలను వదలడానికీ వీలులేదు. పాత్రల సృష్టి పోషణలకు అవకాశంలేకపోయినా అవి సజీవంగా ఉండాలి; ఇతివృత్తవిస్తృతికి అవకాశంలేక పోయినా ఆరంభంనుంచి సమాప్తివరకు సంఘటనప్రవా హం ఉండే తీరాలి. ముఖ్యమైన విషయ మేమిటంటే, ఏకాం కికాస్వరూపం చిన్నదన్నంతమాత్రాన ఆ ప్రయాణంలో పరిణామం లేక రసాస్వాదనం తక్కువైనా సాగిపోవచ్చుని కాదు.

కన్నడంలో ఏకాంకికల ఉద్గమానికి కారణాలు రెండు: ఒకటి పాశ్చాత్యసాహిత్య ప్రభావం; రెండవది, నాటక రసజ్ఞుల ఆసక్తి. దాదాపు 30–40 సంవత్సరాల క్రిందట కన్న డంలో ఏకాంకికలు అంకురించినవి. కాని, ప్రారంభంలో

అదొక విశిష్టమైన కౌశలంగల దృశ్యకావ్యంఅనే అభిప్రాయం అంతగా లేదు. అప్పుడు నాట్యప్రియులకు ఉత్సాహం మిక్కి-టంగావున్నా సౌకర్యాలు తక్కువగా ఉండేవి. రంగస్థలం, వేషభాషలు, పరదాలు, సంవిధానాలు ఏవీలేవు. కనుక పాఠశాలలలోనో,కళాశాలలలోనో,ఏదోఒకఉత్సవసందర్భములో ప్రదర్శితమయే రసాస్వాదనయోగ్యమైన సంభాషణ ఏకాంకిక అనిపించుకొనేది. కాని ప్రారంభదశలోనే నిష్ణాతులైన సాహిత్యకారులు ఏకాంకికారచనకు పూనుకోడం కన్నడ ఏకాంకికలభాగ్యమని చెప్పవచ్చు. కైలాసం, బేంద్రె-వీరిద్దరి ప్రయత్నంలో ప్రారంభమైన ఏకాంకికలకు స్వల్పవ్యవధిలోనే కారంత, శ్రీరంగ, అ. న. కృష్ణరాయమువంటివారిప్రతిభ జీవం నింపింది. నాటినుంచి నేటివరకు ఏకాంకిక ప్రజానురంజకమైన సాహిత్యప్రక్రియ అయింది. కవితకు ప్రేరితులైనట్లే ఏకాంకికకు తరుణ సాహిత్యకారులు ప్రేరితులయ్యారు. నవల ధనసంపాదనకు హామీ ఇవ్వకుండా ఉంటే, ఈసరికి ఆధునిక కన్నడ సాహిత్యం ఏకాంకికామయమయ్యేది.

కన్నడ ఏకాంకిక పెరగవలసినరీతిగా పెరగలేదు. ఇప్పుడిప్పుడు లోమట్టంలో ఉన్నదని చెప్పినా, దాని వైవిధ్యపూర్ణమైన అభివృద్ధిని కాదనలేము. స్థలసంకోచమూ, అనివార్యమైన ఇలాంటి సంగ్రహంలో ఆ వైవిధ్యాన్ని పూర్తిగా ప్రదర్శించడం సాధ్యంకాలేదన్నవిషయం మీ మొదుగుదను. కారంత, కు.వెం.పు., పు. తి. న, కృష్ణమూర్తిపురాణిక-వీరిలాగ పలువురు తరుణులు పద్యాత్మకమైన ఏకాంకికలు రచించారు; కైలాసం, శ్రీరంగ - వీరిలాగ సామాజికసమస్యలను

ప్రతిభావంతంగా చిత్రించిన పలువురు తరుణ నాటకకర్తలు న్నారు; పర్వతవాణిగారివలె ఆనంద (ఉదాహరణం : దహన చిత్ర) మొదలయినవారు పరభాషలలోని ఏకాంకికలను ప్రభావమయంగా జాతీయంచేశారు; భారతీ (ఉదా: తప స్విని) గారిలాగ కొందరు రచయిత్రులు శ్రేష్ఠమైన ఏకాంకి కలను రచించారు; సం.సా.గారు చరిత్రనుంచి వస్తువును ఏరు కుంటే, కృష్ణకుమార కల్లూరు స్వాతంత్ర్యోద్యమంనుంచి ఇతి వృత్తాన్ని, పాత్రలను ఏరుకున్నారు. పెద్ద రచయితలలో ముగుళి, గోకాక, అ. న. కృష్ణరావ్, జి. పి. రాజరత్నం, కల్లూరు మొదలయినవారి కృతులకు, అలాగే చిన్నవారైన కవలి, దాశరథి దీక్షిత, నరేంద్రబాబు, కైవార రాజరాయ మొదలయిన కొందరి కృతులకు ఈ సంగ్రహంలో స్థానం ఉండవలసింది. ఏకాంకికాభ్యుదయచరిత్ర పూర్తికావడానికి అది అవసరం. అయినా, ఏకాంకికారచనలో తమ వైశిష్ట్యం రూపొందించుకొన్న రచయితల సాంకేతిక కౌశలందృష్టితో వైవిధ్య ప్రదర్శకములగు కృతులకు కొన్ని నమూనాలను మాత్రమే ఇక్కడ ఏరుకున్నాము.

కన్నడ ఏకాంకికల స్థానమానాలవిషయంలో తీర్పు చెప్పే కాల మింకా చాలా దూరంలో ఉంది. ఒకదృష్టితో చెప్పవలసివస్తే అట్టి అవకాశమే దొరకలేదు అనవచ్చు. ఏకాంకికల అభివృద్ధికితోడు ఆధునిక నాటకరంగాభివృద్ధిలో ఏకాంకికలు పెద్ద బాధ్యతనే వహించాయి. బలపడడానికి ముందే బరువుమోసినందువల్ల వెన్ను వంగిపోయిందో ఏమో అన్నట్టు ఏకాంకికల అభివృద్ధి కొంతవరకు వికృత

మయింది. సామాన్యంగా నేటి భారతీయ భాషలన్నింటిలోను ఏకాంకికలపరిస్థితి ఇలాగే ఉండవచ్చు. ప్రారంభంలో నాటకకర్తలు ఏకాంకికలు వ్రాసేవారు; నాటకాభిమానులు వాటిని ప్రదర్శించేవారు ఈ దృష్టితో నాటకాభిమానమును ఏకాంకికలే హెచ్చుగా ప్రోత్సహించాయని అనవచ్చు; పూర్వం నాటకాభిమానులు ప్రదర్శనాలు జరుపదలచినప్పుడు నాటకకర్తలు ఏకాంకికలు రచించారు. ఈ దృష్టితో నాటకాభిమానులు ఏకాంకిక అభివృద్ధిని కుంటుపరచారనవచ్చు; వీనికితోడు మాసపత్రికలూ, రేడియోప్రసారాలు చిట్కా దృశ్యాలను వెల్లివిరియజేశాయి. దీనివల్ల రచించాలనే అంతః ప్రేరణ లేకపోయినా రచించవలసిన ఒత్తిడిలో చిక్కుకున్నారు రచయితలు; తరచు తొందరతో వ్రాసేవారే ఏకాంకికారచయితలయ్యారు. పరిస్థితికి అనివార్యమైన ఈ పెరుగుదల పాఠకుల అభిరుచిపై ప్రభావముద్ర వేయడం సహజం. అలా ప్రభావితమై అభిరుచిస్థాయి దిగిపోయిఉంటే, దానికోసం మనం సంతోషమే పొందాలి. అభిరుచిస్థాయి దిగినప్పుడే యోగ్యమైన సాహితికి స్ఫూర్తికలుగుతుందనే విషయాన్ని ప్రపంచ సాహిత్యేతిహాసం యుగయుగాలకూ మనకు ఉద్ఘాటిస్తున్నది.

ఈ ఏకాంకికాసంకలనంలో కన్నడులుకాని పాఠకుల ఉపయోగార్థం, ప్రతి ఏకాంకికకు ముందుగా దాని కర్తృత్వంవిషయమై సంక్షేపంగా విన్నవించాము. దీనితో పాటు ఎన్నుకొన్నదృశ్యంగురించి సూచ్యంగా ఒకటి రెండు మాటలూ విన్నవించాము. ఈ సంకలనంలో స్థానంపొందిన

లేఖకులందరూ ఇంకా కన్నడసాహిత్యానికి సేవచేస్తూనే ఉన్నారు. కనుక మే మిక్కడ ఎన్నుకున్నవే వారి శ్రేష్ఠ రచనలు - అని అనలేము. ఈమాట ఇప్పటికే తమ రచనల శ్రేష్ఠతను హెచ్చుకొనచేసి దివంగతులైన శ్రీ టి. పి. కైలాసంగారికి అన్వయించదు. ఇంతేకాక ఆ యా రచయితలనే ప్రశ్నిస్తే వారు ఇక్కడ మేము ఎన్నుకున్నదే తమ ఉత్తమ కృతి అని అంటారనే భరోసాకూడాలేదు. ఈ సంగ్రహంలోని ఏకాంకికలను ఆవిధంగా తులనాత్మకదృష్టితో చూడరాదని మా సూచన. ఇప్పటి కన్నడసాహిత్యంలోని ఏకాంకికల పుట్టుకను, పెరుగుదలను పేర్కొనడానికి ఈ సంకలనంలోని రచనలు ఉత్తమమైన తార్కాణమనిమాత్రమే గ్రహించాలి.

శ్రీరంగ,
నా. కస్తూరి.

# నాటికాక్రమం

# సంపద్ధర్మం

రచయిత:

'శ్రీరంగ'

[శ్రీరంగ - ఆద్య రంగాచార్య - గారు "నాటక శ్రీరంగ" గారని విఖ్యాతిపొందినప్పటికీ, వారి సాహిత్యసేవ నాటకరచనకు మాత్రమే పరిమితము కాలేదు; నవల, భాషాశాస్త్రం, జీవిత చరిత్ర, కావ్యవిమర్శ, తత్త్వవిజ్ఞాన, సాంఘిక శాస్త్రం, బోధనసమన్వయ మొదలయిన వివిధ రంగాలకు వ్యాపించింది. వీరు పెక్కు నాటకాలను -పెద్దనాటకాలను, ఏకాంకికలను - రచించారు. అవి రంగస్థలంలో చాల పేరుపొందాయి.

మన సామాజిక, రాజకీయ పరిస్థితులలోని నిమ్నోన్నతాలను, వ్యత్యాసాలను హాస్యవ్యంగ్య ధోరణికి గురిచేసి, మనను నవ్వించి కవ్వించే కళ శ్రీరంగగారికి సిద్ధించింది. ఆనాటివారి ఆపద్ధర్మం ఈనాటివారి సంపద్ధర్మంగా స్వార్థంతో ప్రబలుతుండడం వీరు నాటిక సన్నివేశాల పాత్రపోషణలలో సూక్ష్మంగా, గంభీరంగా, ప్రభావశాలిగా విమర్శించారు.]

## పాత్రలు

ఇంద్రుడు

మేఘరాజు

విశ్వామిత్ర మహర్షి

మూర్తి – విశ్వామిత్రమహర్షి తద్రూపం

చండాలుడు

# సంపద్ధర్మం

"ఏపారి తొల్లి త్రేతా
ద్వాపరముల సంధి నొక్క వరపు ధరిత్రి
తాపంబు జేసె జనముల
పాపంబున వత్సరములు పండ్రెం డధిపా.

ఏరులు చెఱువులు నివుర గర్తనము లెం
డున జెడ దరు లతాదులును గసర
భూమియు బస దూల గోమహిషాది జీ
వధనంబు బోలియు భూనరులు నేగ
దప్పి లోకములోని ధాన్యముల్ గొన నధ
ర్మం బంతకంతకు బ్రబల నధ్వరు
ల నడల జెడుపంగ యాగముల్ దేవతా
పూజలు నెడలంగ భూసుర ప్ర
ముఖములైన వర్గముల త్రోవ దప్ప నా
హారరహిత జనంబు లచట నచట
బడగ జూడ ఘోరభంగిగా దానయ్యె
నొక్కయన్నగాని దొరక దయ్యెను."

(మహాభారతం - శాంతిపర్వం -
తృతీయాశ్వాసం 278...302 పద్య)

పైన పేర్కొన్న సందర్భంలో మహాభారతంలో చెప్పిన కథనే ఈ ఏకాంకికలో నేను రూపొందించాను. కథలో మార్పేమీ లేదు. కొన్ని చోట్ల సంభాషణాద్దే

శ్యమూ మూలంలో ఉన్నట్టే ఉంది. కాని మహాభారతం “ఆపద్ధర్మ” మన్నదానికి ఉదాహరించిన కథను నేను “సంపద్ధర్మ” మని సంకేతించాను. మన పరిస్థితికి నా ఆలోచనాసరణికి కథను పొందించి, ముగింపును మార్చుకొని, ఏకాంకికకు ఈ పేరుపెట్టాను. అప్పటి ఆపద్ధర్మం ఇప్పటి సంపద్ధర్మం కావచ్చును కదా! కాకపోతే, ‘యుగధర్మ’ మన్నదానికి అర్థమేమిటి? నేను చేసిన మార్పునకు ఏకాంకికలోనే సమాధానం లభిస్తుంది.

—రచయిత

# దృశ్యవివరణ

[తెరలేవగానే రంగస్థలంలో చీకటి. ప్రేక్షకుల ఎడమవైపునుంచి మేఘాల ఉరుములశబ్దం వినపడుతుంది. ఈ శబ్దం దూరంనుంచి క్రమంగా దగ్గిరికి వచ్చినట్టు ఉండాలి. ఈ శబ్దంనడుమనడుమ (ప్రేక్షకుల) ఎడమవైపునుంచి మెరుపులు. ఇవి క్రమంగా హెచ్చుకావాలి. మూడు నాలుగుసార్లు మెరుపులు సాధారణంగా చూపించి. కడపటిమెరుపు హెచ్చు ప్రకాశంలో ఒకసారి ఇంద్రునిముఖం చూపించాలి. అప్పుడు మెరుపులు ఆపివేసి ఇంద్రునిముఖం ఒక్కటి ప్రకాశంలో కనిపించేటట్టు నిలపాలి. ఈవిధంగా ప్రకాశాన్ని నియంత్రణచేయడం సాధ్యంకానప్పుడు సందర్భానికి తగినట్టు చేసుకోవచ్చు. ఇంద్రునిముఖం కనిపించినంతనే ఎదుట ఉరుములశబ్దం ఆపి, మేఘరాజును చూపాలి. అతని నతమస్తకం, ముకుళితహస్తాలు - ఇవిమాత్రమే వెలుగులో కనిపించాలి. తక్కిన రంగస్థలంలో మొదటిలాగ చీకటి. ఇంద్రునిముఖం కోపావిష్టంగా ఉంటుంది.

మేఘరాజు నుదుటినుంచి గండస్థలాలనుంచి చెమట కురుస్తూవుంటుంది. అతడు ఎగపూపిరి విడుస్తున్నట్టు భుజాలు నిక్కింపు తగ్గింపు సూచిస్తాయి.]

ఇంద్రుడు : ఓయీ మేఘరాజా...

మేఘరాజు : (నాకిట్లోనే) ఇదో, మహేంద్రా, మీ పాదపారిజాతాలను శిరసావహించి నిలుచున్నాను.

ఇంద్రుడు : (కోపాన్ని నటిస్తూ, వెటకారంగా) బలె! భళిరే ఎంత విధేయుడైన సేవకుడు! ఎలాంటి ఆజ్ఞాపాలనం! నా పాదపారిజాతాలను శిరసావహించాడట!

మేఘరాజు : (భయపడిన ధ్వనితో) హా భగవన్! సహస్రాక్ష! నానుంచి ఏమైనా పొరపాటు జరిగిందా?

ఇంద్రుడు : (లక్ష్యపెట్టక కోపావేశంతో) పాదపారిజాతాలట! శిరసావహించాడట ! ఆ పారిజాతాలు నీకు శిరోభారమవడంవల్ల నేనా నా ఆహ్వానం అందుకోడానికి ఆలస్యమైనది ?

మేఘరాజు : (ఇక గట్టెక్కాలన్నట్టు) ఓ పాకశాసనా! క్షమించండి ఈ బడుగు బలాహకుణ్ణి. పన్నెండు సంవత్సరాల వరకు నాకు ఆజ్ఞే దయచేయలేదు, స్వామిఅయిన సురపతి. ఈ అనుగ్రహానికి నే నెందుకు అపాత్రుడనయ్యానని చింతామగ్నుడనైన నాకు తమఆజ్ఞ విన్న వెంటనే మేను వర్షంతో పులకించింది. నీటిబిందువులు లేచి నిలబడ్డాయి. నా సేవ స్వీకరించడానికి స్వామి సిద్ధమైనాడని నేను సకల సన్నాహంతో తరలిరావాలనే...

ఇంద్రుడు : (పూర్తిగా విశ్వాసం కుదరక) సకలసన్నాహమా ?

మేఘరాజు : (నమ్రతతో) ఔను, ఆఖండలా ! సకలసన్నాహంతో—ఇదో, విలంబం కాకూడదని ఝంఝామారుతాన్నికూడా మింగి మేను పెంచుకొని వచ్చాను.

[రొజుతున్నట్టు ఊపిరికోసం ఆగుతాడు.]

ఇంద్రుడు : (మందహాసంతో) ఓహో ! అందుకోసమే నీ భుజాలు ఇంత రభసంతో ఎగురుతున్నాయి కాబోలు ! బలాహకా ! నొచ్చుకోవద్దు. భూలోకవాసుల బుద్ధిహీనతకు, కర్మలోకవాసుల కృతఘ్నతకు, నేను కోపావిష్టుణ్ణయ్యాను; నీపైన కాదు.

మేఘరాజు : (సంశయధ్వనితో) భూలోకంకోసం...కర్మలోకం కృతఘ్నత? అయితే ప్రభూ, పురందరా— ఇంకా నాకు సేవాసౌభాగ్యసమయం రాలేదా ?

ఇంద్రుడు : (కొంచెం ఆవేశంతో) లేదు...అయినా, ధారాధరా, ధైర్యంవహించు. ఇదిగో ఇప్పుడు పరీక్షాసమయం వచ్చింది

మేఘరాజు : (కొంచెం ఆశ్చర్యంతో) పరీక్షా ! సురలోకస్వామికి పరీక్షా?

ఇంద్రుడు: పరీక్ష నాకు కాదు. (క్రమంగా మాటలతోపాటు ఆవేశం ఎక్కువవుతూ ఇంద్రుడు తనలోతానే అన్నట్టుగా మాట్లాడుతాడు.) పరీక్ష నాకు కాదు. ప్రజాలోకపు పాపబుద్ధిగల ప్రాణుల పరీక్ష. అబ్బ ! అది ఎలాంటి కృతఘ్నత ! అదేమి అహంభావం ! త్రేతాయుగం ముగిసింది. ఆ యుగపురుషుని అవతార సమాప్తి అయింది. అందుకే వచ్చే కొత్తయుగం తనదని గుండె దిటవు ఆ జనానికి ! ఇంత అల్పావధిలో అవతారపురుషునే అలక్ష్యంచేసే అహంమన్యత ! "పరస్పరం భావయంతః" అనే పాఠం సురల నరుల నేర్పాలా వీరికి ? దేవతలను మరిచారు, యజ్ఞాలను వదలిపెట్టారు. అంతా తనకోసమేననే ఆరాటం వీరిది ! అహా ! ప్రాణాలకోసం జీవరించే ఈ జంతువులకు ఇప్పుడు అనుభవమౌతుంది ! పన్నెండు సంవత్సరాలవరకు నేను సృష్టిని ఆపినందుకు ఇప్పుడు వీరిబుద్ధి కాలి కళవళపడిపోతున్నది. అదిగో అంబుధరా, అలా కిందికి చూడు.—

[ఈ మాటలు ముగిసేవేళకు దృశ్యం మూర్ఛవలసిఉన్నందున క్రమంగా ఇద్దరు వ్యక్తులమీదా ఉన్న ప్రకాశం తక్కువచేస్తూపోవాలి, ఈ క్రమంలో మొదట మేఘరాజుమీది ప్రకాశం తొలగించాలి. తర్వాత ఇంద్రునిముఖం కనిపించకపోయినప్పుడు చీకట్లో ఇంద్రుడు ఆఖరు రెండువాక్యాలూ చెప్పాలి.]

అదిగో, అంబుధరా, చూచావా, పదకొండు సంవత్సరాలవరకు ఇంద్రుని కృపాదృష్టి కలుగనందుకు భూలోకంఅవస్థ ఏమైందో! నీరుఎండిపోయిన నదుల కడుపులు బీటలువారాయి. అదిగో, నీటిజంతువులు కోటానుకోట్లుగా చచ్చిపడి, కుళ్ళి గుట్టలుగాపడ్డాయి! వాటిని తిని బతుకవలసిన పక్షుల ఎముకలమేట్లు చూడు. హా హా హా! ఒకదానినొకటి తిని బతికే ప్రాణి లోకంలో ఒకటి మరణిస్తే, వరసగా సకలప్రజాతంతువే భిన్నమైపోతుంది. ఇక్కడ చూడు, ఆవులు దూడలు లేవు; మేకలు గొర్రెలు లేవు; గేదెలు లేవు; కనుక మానవునికి ఆహారమే లేదు. ఇదో చూచావా? తిన తిండిలేక జనం ఒకరినొకరు చంపి తినడం! జనులసంగతి అలాఉండనీ; హా హా! అదిగో చూడు, చూడు అక్కడ దిక్కులేక పరిగెత్తే మానవజీవిని? చూచావా? అది ఎవరనుకున్నావు? మహా - మహా - ఋషి అని చెప్పుకునే విశ్వామిత్రుడు! ఘోరతపస్సుతో ఇంద్రుని- హా! నన్ను!- వణికించివేయగలనని ఒంటికాలిపై నిలిచిన విశ్వామిత్రునికి ఇప్పుడు రెండుకాళ్ళూ చాలడంలేదు- పరిగెత్తడానికి! అన్నమున్నచోటికి పరిగెత్తడానికి.

పరిగెత్తి దానిని ఆహరించడానికి! బలే! బలే! నడి
రాత్రివేళ నడయాడే ఆ విశ్వామిత్రుణ్ణి చూడండి. తన
వల్లనే ఈ జగత్తు నడుస్తున్నదనే అహంకారం ఇంకా
అతనిని వదలలేదు! చూశారా? ఇప్పుడొక శ్వపచుడైన
చండాలుని గుడిసెకు వచ్చాడు. ఛీ! మానవప్రాణికి
సిగ్గులేదు. తనచుట్టూ ప్రాణుల హాహాకారం దిక్కులనే
భేదిస్తున్నట్టు వినబడుతున్నా, లోకస్థితికి నేత తానని తెలి
సిన విశ్వామిత్రుడు ఆ హాహాకారాన్ని వినిపించుకోవడం
లేదు. అడుగో, ఆ చండాలుని గుడిసెలో వ్రేలాడే
కుక్కపేగులమాంసంకోసం దేవుళ్ళాడుతున్నాడు!

(ఇప్పుడు పూర్తిగా చీకటి)

కానీ — మర్త్యజీవికి పరీక్షాసంధికాల మిది! నేను
రాజా! దీని అంత్యనిర్ణయంకోసంసన్నద్ధుడనై వుండు.

## ముఖ్య దృశ్యం

[అర్ధరాత్రిసమయం సూచించేటట్టు ప్రారంభంలో రంగస్థలంమీద మందప్రకాశం ప్రసరింపజేయాలి. (ప్రేక్షకుల) ఎడమవైపు ఒక గుడిసె ముందుభాగం, తెరచిన తలుపూ కనిపిస్తాయి. గడపపై తలపెట్టి లోపలికి కాళ్ళుచాచి పడుకున్న ఒకవ్యక్తి. (ప్రేక్షకుల) ఎడమవైపు రంగస్థలం వెనుకకొననుంచి ఇంద్రుడు వర్ణించిన స్వరూపంలో విశ్వామిత్రుడు ప్రవేశిస్తాడు. అతడు వచ్చేవైపునుండి పడుకున్నవ్యక్తి కనిపించడు. మొదట సూచించేవరకు విశ్వామిత్రుడు రంగమధ్యభాగం దాటి పడుకున్నవ్యక్తి కనిపించే స్థలానికి రాకూడదు. ఇప్పుడు విశ్వామిత్రుడు దొంగలాగ చుట్టూ చూచి మెల్లగా అడుగులువేస్తూ, గుడిసెవద్దకు వద్దా మనుకునేలోపల గుడిసెముందుభాగంనుంచి మరొకవ్యక్తి నడిచివస్తాడు.

ఈ వ్యక్తి ప్రేక్షకులకు ఎదురై ముఖంచూపరాదు. సాధ్యమైతే ఈ మూర్తిని అస్పష్టంగా చూపాలి. (ప్రేక్షకులకు ఎదురుగా నిలవకపోయినా, వారికి మాటలు వినిపించనట్టు వీపుతిప్పి నిలబడరాదు.) ఈ వ్యక్తి వేషమూ రూపమూ విశ్వామిత్రునిలాగే ఉంటుంది; కాని అతని అంగాంగచలనంలోమాత్రం దొంగతనపుఛాయ ఉండదు. విశ్వామిత్రునికి ఒక్కసారిగా ఈ వ్యక్తి ఎదురువచ్చినట్టయి అతడు (విశ్వామిత్రుడు) వెంటనే పరిగెత్తిపోదామన్నట్టు శరీరం తిప్పి, మరొకసారి మూర్తిని చూచి భయపడినవాడిలా దీనునిలా, చేతికిచిక్కిన దుర్బలుడైన దొంగలాగ -]

విశ్వామిత్రుడు : ఎవరు - ఎ - వ - రు నీవు ?

మూర్తి : ఓరీ - విశ్వామిత్రా -

విశ్వా : (బెదరిపోయినట్టు) విశ్వామిత్ర ! నా - నాపేరు ఎలా తెలిసింది నీకు ?

మూర్తి : (నవ్వుగొంతుకతో) నీపేరు ఎలా తెలిసింది ! హాహా ! నీవు ఇక్కడికి వచ్చిన ఉద్దేశంకూడా తెలిసింది !

విశ్వా : (కొంచెం భయపడి) ఏమన్నావు ? నా మనస్సులోని ఆలోచనకూడా తెలిసిందా ?

మూర్తి : (తలపంకిస్తూ) అన్నీ తెలిశాయి. మొదట ఇక్కడినుంచి కదులు నీవు.

విశ్వా : (మూర్తివల్ల కలిగే భయంలేదని మనస్సుకు తెలుసుకున్నవాడిలాగ నిట్టూర్చి) హూ ! అలాగా ? నాకంటేముందుగా వచ్చినవాడివా నీవు ?

: లేదు. నీతోకూడానే వచ్చాను; నా జతకు నిన్ను పిలుచుకొనిపోదామనుకున్నాను.

విశ్వా : అలాఅయితే, కొంచెం ఆగు. ఆకలితో అట మటించిపోతున్నాను. దగ్గర్లో మాంసంవాసన వస్తూంది. దానిని తిని కొంచెం ఆకలితీర్చుకుంటాను. తర్వాత నీతో వస్తాను.

మూర్తి : ఛీ ఛీ! మునిశ్రేష్ఠా, ఎంత పాడుపని యిది! నిన్ను ఈ పని చేయనీయకూడదనే వచ్చాను – నిన్ను పిలుచు కొని వెళ్ళడానికి.

విశ్వా : పాడుపనా! ఈ విశ్వామిత్రునికి మేలు కీళ్ళు ఉప దేశించేది ఈ కూనా? సరి; విడు దారి!

మూర్తి : (అడ్డగించినట్టు నిలబడి) నేను విడిచినదారి త్రొక్కావంటే నీవు చెడిపోతావని తెలుసుకో. నీవు పట్టినదారి చండాలుని గుడిసెకు. నీకు కొట్టిన వాసన కుళ్ళిపోయిన కుక్కమాంసానిది.

విశ్వా : (ఆకలిబాధతో ఆవేశవశుడై) ఓరీ, నావంటి ముని శ్రేష్ఠునికి మడి మైలలను గురించి పురాణం చెపు తున్నావా?

మూర్తి : (మధ్యలోనే) నీవు మునిశ్రేష్ఠుడివే. ఇది మనస్సు మడి మైలలమాట కాదు; ఆదర్శమైన నీతి – శీలానికి సంబంధించిన విషయం.

విశ్వా : (తిరస్కారంతో) హాహా! ఎవరు ఎవరికి ఆదర్శం?

మూర్తి : నీవు ఈ చండాలునికి ఆదర్శం. మునిశ్రేష్ఠుడైన నీవు ఈ అధమవర్ణునికి ఆదర్శం; తపోనిష్ఠచే బ్రాహ్మణు డవైన నీవు ఈ......

విశ్వా : హాఁ! ఆపు నీ నాలుకను. ఏలోకపు ప్రాణివి నీవు ? ఓరీ ఏ యుగపుమాట చెబుతున్నావు నీవు ? త్రేతా యుగం ముగిసింది. ఇప్పు డెవరూ శ్రేష్ఠులు కారు; ఎవరూ కనిష్ఠులు కారు; అందరూ సరిసమానులు.

మూర్తి : అయినా చండాలునికి చెందవలసిన ఆహారం నీవు తినాలంటున్నావుకదూ ? అదీ దొంగతనంగా !

విశ్వా : (దొంగనవ్వు తెచ్చుకుని) హహ్హా ! నీకు ఈ నూతన యుగపద్ధతే తెలియదు. అందరూ తత్త్వతః సరిసమానులు. అయితే వారివారి గుణకర్మలకు ఎవరికి వారే బాధ్యులు.

మూర్తి : ఓయీ మునిసత్తమా ! మాటలనాడుగుంటో దూకవద్దు. నీవు ఏమిచెప్పినా ఆ ఆహారం నీది కాదు.

విశ్వా : (కోపగించుకుని) ఎందుకు ? – ఎందుకు కాదు, ఎందుకు కాకూడదు ? లోకహితంకోసం తపమాచరించినవాడిని నేను; నానుంచే లోకం ఉంటూంది; నానుంచే యుగం మారుతూంది. నేను బతికితే లోకం బతుకుతుంది. అందుకోసం లోకపు ఆహారానికి అధి బాధ్యుణ్ని నేను. చాలు – ఇంక ఎక్కువసేపు ఆపకు నన్ను – ఆకలిబాధతో నాకు అపాయంకలిగితే ... (ఈ మాటలు అంటున్నప్పుడు విశ్వామిత్రుడు మాంసాన్ని తీసుకుని వెళ్ళడానికి ప్రయత్నిస్తాడు. కాని, మూర్తి అంటుకుపోయినట్టు ఎదురుగా నిలబడుతుంది. ఆగ్రహించి) తప్పుకో – పక్కకు తప్పుకో – లేకపోతే—

మూర్తి : లేకపోతే ఏమిచేస్తావు ? నేను మరణిస్తే నీవు బదుకలేవు. నీవు బదికిఉన్నంతవరకూ నేను మరణించను.

విశ్వా : (కోపంతో) ఓరీ — అలాంటివాడివి ఎవరు నీవు ?

మూర్తి : (గంభీరంగా) నేను నీవే.

విశ్వా : (అర్థంకాక) ఏమన్నావు ?

మూర్తి : నీవు నేనే. (అంటూ అతనిని తిప్పి గుడిసెకు దూరంగా తీసుకొనివెళ్ళేటానికి తోస్తున్నట్టు ప్రయత్నించగా —)

విశ్వా : (అత్యంత సంతాపంతో) ఓరీ తుంటరీ — నన్నా- నిన్ను (అంటూ తిరిగి మూర్తిని కొట్టాలని చేయెత్తగా అకస్మాత్తుగా మూర్తి మాయంకావడం చూచి) ఓరీ ! ఇదేమిటి ? భూతాటకమా ? ఆకలితో నిస్త్రాణతో నాకు స్వప్నంవచ్చిందా ? నేను చూచింది మూర్తి కాదూ !

మూర్తిధ్వని : నీవు చూచింది మూర్తినే — ఇదిగో ఇప్పుడు నేను నీలోపలనే ఉన్నాను.

విశ్వా : (గిరగిర తిరుగుతూ చుట్టూ చూస్తూ) ఓరీ, ఏమిటిది ? కండ్లకు చీకటి ! అయ్యో ! భ్రష్టుడనయ్యాను. (పెద్దగా కేక వేస్తాడు.)

[కేక విని గుడిసెవాకిట్లో పడుకున్న వ్యక్తికి మెలకువ వస్తుంది. వేషాన్నిబట్టి గుడిసె యజమాని అయిన చండాలుడు అని స్పష్టమౌతుంది.]

చండాలుడు : (అకస్మాత్తుగా లేచి కూర్చుని) ఏమిటి ? ఎవరది ? ఏమైంది ?

విశ్వా : (ఇంకా భయాశ్చర్యాలతోనే) ఏమిటి ? ఎవరు? ఎక్కడ ? (అంటూ చండాలుణ్ణి చూచి చకితుడై) ఓరి! నీవు ఎవరు ?

చండా : (లేచి నిలబడుతూ) నేను చండాలుణ్ణి. అయితే అర్ధరాత్రి సద్దులేకుండా ఇక్కడికి వచ్చిన నీవెవరు ?

విశ్వా : నేను – నేను – (ఏమి చెప్పాలో తెలియక తొట్రుపడుతూ) ఓరీ ! నేను ఎవరినో అడిగే అధికారం నీకేముంది ?

చండా : నేను చండాలుణ్ని; ఇది నా గుడిసె. ఇక్కడికి నీవు వచ్చావుకదా ! అందుకోసం అడుగుతున్నాను–

విశ్వా : (మధ్యలోనే తిరస్కారంగా) చండాలుణ్ణి చండాలుణ్ణని ఎంత అభిమానంతో చెబుతున్నాడు -- హాహా! – తాను చండాలుడు, ఇది తనగుడిసె అని ! (అంటూ కొంచెం ముందుకు వస్తాడు.)

చండా : (గుడిసెలోపలినుంచి వెలుపలికి అడుగుపెడుతూ) ఎందుకు చెప్పగూడదు ? నా జాతికోసం ఎందుకు అభిమానపడరాదు ? నా కాయకష్టంతో వేసుకున్న గుడిసె నాదని చెప్పుకునే అభిమానం నాకు ఉండగూడదా ? (వాడూ ముందుకు నడిచివస్తాడు.)

విశ్వా : ఒక్కసారిగా దీర్ఘోచ్ఛ్వాసంతో) ఆహా ! అదే వాసన ! (ఎదురుగా గుడిసెలోకి చూస్తూ) ఆహా !

ఇక్కడుంది వాసన) అంటూ ముందుకు పరిగెత్తు తున్నప్పుడు)

చండా : (అతనిని అడ్డగిస్తున్నట్టుగా నిలబడి, కొంచెం ఉచ్చైస్స్వరంతో) ఎవరు నీవు?

విశ్వా : (అవమానం భగ్గుమనగా) ఓరీ! దూరంగా తొలగిపో! నన్ను తాకడానికి సాహసిస్తావా?

చండా : (జంకకుండా) నీవు ఎవరు? ఇక్కడికి ఇలాంటి సమయంలో ఎందుకు వచ్చావు?

విశ్వా : (అత్యంత కోపావిష్టుడై) హా! దూరం! నా శాపంతో సురిగిపోతావు. నేను ఎవడనో ఆ గొడవ నీకెందుకు? అయినా, నీ భయమేమిటి నాకు? తన మనస్సాధ్య తపస్సుతో దేవతలను వణికించిన విశ్వామిత్రుణ్ణి నేను. (చండాలుడు భయభక్తిముద్రతో చూస్తాడు.) క్షామకాలంలో ఆహారం దొరక్క, ఆకలితో అటమటిస్తూ, ఈ గుడిసెలో కనిపించే మాంసం దొంగిలించి తినాలని వచ్చాను. (చండాలునిముఖముద్రలో అకస్మాత్తుగా పెద్దదిసన్న మందహాసం కనిపిస్తుంది. దానికి కనలి. దాగికిఅడ్డంటే! నీ స్పర్శ నాకు తగలకూడదు.

చండా : (సావకాశంగా తలఊపుతూ) నా స్పర్శక్కువద్దు! నానద్దఉన్న చలిదిమాంసంమాత్రం కావాలి!

విశ్వా : ఓరీ! నీదగ్గర ధర్మం నేర్చుకోవడానికి నేను రాలేదు. దూరంగా పో. ఆకలిబాధ ఓర్వరానిది. క్షణ

మాత్రం విలంబమైతే నా ప్రాణమేపోతుంది. బ్రాహ్మ ణుని చంపినపాతకం నీకు తగులుతుంది.

చండా : (చేతులుజోడించి) బ్రాహ్మణులు కాదు; బ్రాహ్మణశ్రేష్ఠులు మీరు. అందువల్లనే అడుగు తున్నాను—నాదగ్గరున్న మాంసం స్పృశించి తినడం—

విశ్వా : (తిరస్కారంతో) హుఁ! ధర్మాధర్మ సూక్ష్మం చండాలుడైన నీ కెలా తెలుస్తుంది ? ఈ మాంసం తింటే, నేను బదుకుతాను. ప్రాణరక్షణ ఎన్నటికీ పాపంకాదు. అయితే ! నేను నిన్ను స్పృశించకూడదు. స్పృశించను. ప్రాణరక్షణకు ఏదో తినకతప్పదు.

చండా : బ్రాహ్మణశ్రేష్ఠా, తింటే బ్రదుకుతాననేభ్రాంతి మీకూ వదలలేదా ?

విశ్వా : (వెరగుపడి) "తింటే బ్రదుకుతాననేది భ్రాంతా ? ఏమిటి ? - ఏమిటది ? నీవు చెప్పేది !

చండా : (వెరగుపడిన విశ్వామిత్రుని ఒక్కొక్క మాటతో ఒక్కొక్క అడుగు వెనుకకు నెట్టుతూ) తింటే బ్రదుకు తాననేది భ్రాంతి; నిశ్చయంగా భ్రాంతి. విప్రోత్తమా, ఈ మాంసంతింటే మీరు బ్రదకడం నిశ్చయమని హామీఇవ్వగలరా ? తిన్నా అరక్కపోతే మరణం సంభవించవచ్చు. తిని త్రేన్చేటప్పుడు ఒక్కమాటుగా ప్రాణవాయువు ఎగిరిపోవచ్చు. తిని గాఢంగా నిద్రించి నప్పుడు ఎవడైనా కుత్తుకపిసికితే బ్రతకడం సంభవమా? దీన్ని తిని ఇక్కడినుంచి దూరంగా వెళ్ళినపుడు ఒక రాయితగిలి కిందపడి, ఆ దెబ్బతో ప్రాణాలు వదలవచ్చు

కదా! మునివర్యా, తిండివల్ల బ్రతుకుతాడనే నియమ మేమీలేదు; బ్రదికినవాడుమాత్రం తినవలసే ఉంటుంది. (విశ్వామిత్రుని చూస్తూ నిలబడతాడు.)

విశ్వా : (క్షణంసేపు దిగ్భ్రాంతుడై, తర్వాత చుట్టూచూచి తాను ఎక్కడున్నదీ మళ్లీ తెలుసుకున్నట్టు గుడిసెవైపు తోసుకొని పోయేవాడిలా తొందరపడుతూ) హా హా! కేవలం జన్మతోనే కాదు, గుణంవల్లకూడా నీవు చండాలుడివే! నీ ఈ చండాలబుద్ధిమంతనంతో నన్ను ఓడించాలనుకున్నావా ? సరి, నన్ను అడ్డుపెట్టకు !

చండా: అడ్డుపెట్టకు! అలాఅయితే వచ్చిన దొంగను చేతులు పట్టుకొని ఆహ్వానించి, చేతులతో తీసియిచ్చి, మొక్కి పంపించాలా నేను?

విశ్వా : తలుపే తెరచిపెట్టి పడుకుంటే ఏ దొంగైనా రావచ్చు.

చండా : నేను తలుపు మూసిపెట్టాలా ? నా గుడిసెలో అలాటిదేముందని నేను సిగ్గుపడి, భయపడి తలుపులు మూసుకోవాలి ? కష్టపడి గడించినంత, స్వంతానికి చాలినంత – ఇదే నా గుడిసెలో సంసారం. ఇతరులది కోరని నేను నా వస్తువును ఆ ఇతరులకు, అందులోను దొంగబుద్ధికలవారికి——

విశ్వా : (కసరి మాటకు అడ్డువచ్చి) చండాల హంతకుడా, దొంగతనం కా దిది; ఆపద్ధర్మం.

చండా : (నకిలీగా, వెంటనే) ఏమన్నారు ! ఏ ధర్మం ?

విశ్వా : (పెద్దతనంతో) ఆపద్ధర్మం. ఆపత్కాలంలో ఏమైనా చేయడానికి నా కధికారం ఉంది.

చండా : అలాగా ? (దగ్గరగా జరిగి నిలబడి) అలాఅయితే మునిశ్రేష్ఠులు ముందుకు అడుగు వేయవచ్చు. గుడిసె లోని మాంసమూ తినవచ్చు. (మరచినవాడివలె) ఏకాలపు ఏధర్మం—అన్నారు ?

విశ్వా : (గెలిచానని గుడిసెవైపు వెళ్ళుతూ) ఆపత్కాలపు ఆపద్ధర్మం.

చండా : హుం! ఊహుం— కాదు—ఇది సంపద్ధర్మం.

విశ్వా : (తటాలున తిరిగి నిలిచి) ఏమిటి ? ఏమన్నావు ?

చండా : (తనలోతానే అనుకున్నట్టు)ఇది సంపద్ధర్మం. వేలాదిగా జీవులు ఆకలిఅనే ఆపత్తుకు చిక్కి చచ్చేటప్పుడు తానొక్కడే ఉన్నంతవరకు తిని బతకాలనేది సంపద్ధర్మం. ఆహుతిఅయినవానికి ఆపద్ధర్మం. స్వార్థసంరక్షకుని కిది సంపద్ధర్మం.

విశ్వా : (ఒక్క అడుగు ముందుకువచ్చి) ఓరీ మూర్ఖా—శతమూర్ఖ – జన్మజన్మాంతరమూర్ఖా! ఆపద్ధర్మమనేది ఎప్పటినుంచో వస్తున్న ధర్మం. సనాతన పరంపరాగత ధర్మం.

చండా : (నిశ్వసించి తలఆడిస్తూ) మరణం లేక జననం లేదు, అనృతంలేక సత్యం లేదు. అనృతపరంపరకూడ సనాతనంగానే ఉంది.

విశ్వా : ఛీ చండాలబుద్ధీ ! సనాతనసత్యాన్ని అనృతపరం

పర అంటావా ? అగస్త్యునివంటి మహర్షి వాతాపిని తినడం అబద్ధమంటావా ? తప్పంటావా ?

చండా : అగస్త్యుడు వాతాపిని తినడం ఇతరులను బతికించడానికి.

విశ్వా : నేను ఈ మాంసం తినడం –

చండా : (మాటకు అడ్డంవచ్చి) మిమ్మల్ని మీరు ఒక్కరినే బ్రతికించుకోవడానికి. కేవలం స్వార్థవృత్తితో –

విశ్వా : (ఆగక) ఓరీ! నేనంటే ఎవరనుకున్నావు? నన్ను రక్షించుకుంటే ఈ జగత్తునంతా రక్షించుకొన్నట్టు. శ్రేష్ఠవర్ణంవాడు – తక్కినవర్ణాల యోగక్షేమాలు చూసుకుంటాడు –

చండా : (అడ్డువచ్చి) మునిసాధ్యులు క్షమించాలి. నాబోటి చండాలుడు ఉన్నచోటమాత్రం మీరు శ్రేష్ఠులు. లేకపోతే ఎవరికి శ్రేష్ఠులు మీరు? నేను ఉంటేనే నా యోగక్షేమం. నేను లేకపోతే ఎవరి యోగక్షేమాలు చూస్తారు మీరు ? మీరు శ్రేష్ఠులు కావాలనుకున్నా, తపస్సుకు నా అస్తిత్వం అవసరం. కనుక ముందు నేను జీవించాలికదా – ఆ మాంసం ఇలా ? (అంటూ గుడిసెవైపు వెళ్ళి దాచుకోబోతాడు)

విశ్వా : (గాబరాపడి) హాఁ! (అంటూ అడ్డగించడానికి వెళ్ళి, శక్తిచాలక తత్తరపడతాడు. చండాలుడు ఇంకా నిలుచున్నచోటే నిలబడుతుండటం గమనించి, నిస్సహాయుడైనట్టు దీనంగా) ఓరీ! చండాలా! ఆకలితో బుద్ధిచెడిన నన్ను ఎంతసేపు వ్యర్థమైన వాదాలతో ఆయాసపెడతావు ? ఆకలి

బాధ తాళరానిది. ఇప్పుడు నేను తినకతప్పదు. ప్రాణాలు కాపాడుకోనడానికి ఏమితిన్నా తప్పులేదు. నా ప్రాణాలు కాపాడుకొనే అధికారం నాకు ఉంది.

చండా : (వెంటనే) లేదు –

విశ్వా : (కలగన్నట్టు) ఏమిటి ? నా ప్రాణాలను –

చండా : (అడ్డునస్తూ) ఆ ప్రాణాలు మీవి కావు. మీరుగా తీసుకువచ్చారా ? కాయకష్టంతో గడించారా ? మీది కానిదానిమీద మీకు అధికారం ఏమిటి ? ఇచ్చినవానికి అధికారండుంది ? లాక్కునేవాడూ వాడే.

విశ్వా : (అంగలార్చి వేడుకొనేటట్టు) కొసకు ఆకలిగొన్న వానికి తినేఅధికారం ఉందని ఒప్పుకుంటావా ?

చండా : ఛీ ! ఆమాట ఒప్పుకుంటే ఇప్పుడే ప్రళయకాలం వచ్చేస్తుంది. ఆకలిఅయినంతమాత్రాన కనిపించినవారి అన్నం లాక్కొనే అధికారం వచ్చేటట్టయితే, వేదాల ప్రమాణం ఎందుకు ? ధర్మభీతి ఎందుకు ?

విశ్వా : (హతాశుడైనట్టు) ద్విజశ్రేష్ఠుణ్ణి నేను; వర్ణాశ్రమ యోజనలో జ్యేష్ఠవర్ణం నాది—

చండా : (అడ్డువచ్చి) అందుకోసమే – తక్కినవారు చేస్తే దొంగతనం అనిపించింది – మీకు చేస్తే "ఆపద్ధర్మం" అనిపిస్తూంది, మీకు.

విశ్వా : దొంగతనమనిపిస్తే వద్దు. నీవే చేతితో తెచ్చి ఇవ్వు—

చండా : (చకితుడై వెనక్కుతగ్గి) నేను నా చేతినుంచి ఇవ్వడమా ?

విశ్వా : ఆపద్ధర్మంలో అంతా జరుగుతుంది. నీవు చండాలు డవైనా ఆక్షేపణలేదు.

చండా : నా చండాలత్వంతో సంబంధంలేదు. మునిశ్రేష్ఠా, నేను మనుష్యుణ్ణి. అందుకోసం చేతితో ఎత్తి ఇవ్వలేను. తక్కినవారు చచ్చినా చింతలేదు; తాను బతికితేచాలు అనే వానికి చేతితో ఎత్తి ఇవ్వలేను.

విశ్వా : (ఆకలిబాధతో ఒక్కసారిగా పిచ్చిపట్టినవాడి లాగా) చాలు ! చాలు ! ఈ చండాలునినించి నాకు ధర్మోపదేశమా ? సర్వశ్రేష్ఠతకు సంబంధించిన అధికారం నాకుంది. శాపమిచ్చేశక్తి నాకుంది. ఆపద్ధర్మపు ఆధార ముంది. అవసరమైతే శాస్త్రాన్నే మార్చివేసే తపోనిష్ఠ ఉంది. నేను బతికేతీరాలి. నేను తినేతీరాలి. (అంటూ వెర్రివానిలాగ తత్తరపడుతూ, గుడిసెలోపలికి పరు గెత్తుతాడు. చండాలుడు ఆ వైపుకు వీపుతిప్పి ఆకాశం వైపు చూస్తూ నిలబడతాడు. అంతలో రంగస్థలంమీద మరల చీకటి ముసురుకుంటుంది.)

[వెంటనే విరావిక నవ్వుతున్న ఇంద్రునిధ్వని వినబడుతుంది. ప్రారంభంలోలాగే ఇంద్రుని చూపాలి.]

ఇంద్రుడు : (నవ్వును ఆపుకొంటూ, గర్వోత్సాహాలతో) మేఘరాజా! కొసకు గెలిచాడు ఇంద్రుడు. విశ్వామిత్రు డంతటివాడు స్వార్థంకోసం చేయరానిపని చేయడానికి సంసిద్ధుడయ్యాడు. నేడు మానవకులం శాశ్వతంగా ఓడిపోయింది. ఇక ఈ ఇంద్రునికి భయమనేదే లేదు. ఇక నీవు వానకురిపించు, ఎంతబడితేఅంత – నీ ఇచ్ఛ

వచ్చినంత కురిపించు. పన్నెండు సంవత్సరాలనుంచి కురి పించవలసిన వాననంతా కురిపించు. విశ్వామిత్రుని సాహసానికి ప్రీతుడనై వర్షంకురిపించానని మానవకులం తెలుసుకుంటే నాకు మరింత క్షేమం. అందరూ ఆపద్ధర్మ బంధువులవుతారు. కురిపించు; కురిపించు; మానవ కులాన్ని ముంచి తేలించేటంతటి వానకురిపించు; మర్త్య లోకమే కొట్టుకొనిపోయేటంత వానకురిపించు; ఓడి పోయిన మానవునికి ఓటమిలోనే సంతోషమయ్యేటట్టు —కురిపించు—కురిపించు—కురిపించు.

[పెద్దపెట్టున నవ్వుతున్నప్పుడు తుదివాక్యానికి తాళంవేసినట్టు మేఘగర్జనం తీవ్రంగా వినిపిస్తూండగా]

—: తెర :—

# జాతర

రచయిత:

## శ్రీ ద. రా. బేంద్రె

దత్తాత్రేయ రామచంద్ర బేంద్రేగారు ఆధునిక కన్నడకవులలో అగ్రపంక్తికి చెందినవారు. మన జానపదగీతాల నడక బెడగునూ, మాటలమితప్రయోగమర్మాన్నీ ఆధునిక కవితారామానికి తెచ్చి నాటి పెంచిన కీర్తి వారిది.

బేంద్రేగారు ఉత్తమ వచనరచయితలు కూడా. సాహిత్యపరిశోధన, కావ్యమీమాంస,విమర్శలనుగురించి గ్రంథాలు ప్రకటించారు; 'అవిద్ధ', 'సుకుమార', 'హాస్య' నాటకాలు రచించారు. 'జాతర' హాస్యావృతమైన గంభీరనాటిక.)

## పాత్రలు

దేవయ్యగారు : వెర్రిపాలెం సంస్థానాధిపతి

దివాంజీ

గుమాస్తా

డాక్టరు

నౌకర్లు

దండోరామనిషి

# జాతర

[రాచనగరములోని దివాన్‌ఖానా. దొరగారు మంచంమీద ఒరిగి ఉంటారు. దివాంజీ సర్కారు డాక్టరుతోపాటు వస్తారు. గుమాస్తా వారి వెంట వస్తాడు. వారందరూ దొరగారికి నమస్కారంచేసి తమతమ స్థానాల్లో కూర్చునేవేళకు దొరగారు లేచి కూర్చుంటారు.]

దేవయ్యగారు (దొరగారు) : (కూర్చున్నచోటనుంచి ముఖం అటుఇటూ తిప్పుతూ) దివాంజీ !

దివాంజీ : (ఆసనంనుంచి లేచి నిలబడి) అయ్యా చిత్తం.

దొర : జాతర జరిగితీరాలి.

దివాంజీ : (తలవంచి వినయంతో) చిత్తం, అలాగే.

దొర : డాక్టర్‌గారూ, ఊళ్లో ప్లేగూ గీగూ ఏమీలేదు, అంతేకదూ ?

డాక్టరు : దొరగారండి, ఏమిచెప్పను. నిన్న మొన్న నలుగురు ప్లేగుగంట్లులేచి చచ్చిపోయారు.

దొర : మందు ఎవరిచ్చారు ?

డాక్టరు : నేనేనండి, దొరగారూ.

దొర : అలా అయితే వాళ్లు చనిపోవడం ప్లేగుగంట్లతో కాదు. ఊళ్ళో ప్లేగులేదు. వాళ్లేమి గంటు (ముల్లె) కట్టుకుని వచ్చారా? ఏమైనా, ఊళ్ళో ప్లేగులేదు. నిజమేనా ?

డాక్టరు : ఇంటింటా పడుతున్న ఎలుకలు మాత్రం ప్లేగువి. నిజం.

దొర : ఎలుకలవిషయం మీరు చెప్పకండి బొంబాయి నుంచి సర్కారుజవాబు రానీండి. సర్కారు చెప్పింది సత్యం. దివాంజీ, దండోరా వేయించమనండి.

[దివాంజీ గుమాస్తాకు సైగచేస్తాడు. గుమాస్తా లోపలికి సైగ చేస్తాడు. వెంటనే దండోరా మనిషి దండోరావేయడం వినిపిస్తుంది. "వినండయ్యా వినండి! సర్కారు దండోరా : ఊళ్ళో ప్లేగులేదు. ఎవ్వరూ ఊరు విడవనక్కరలేదు. జాతర జరుగుతుంది. సలక్షణంగా జరిగితీరుతుంది" డప్పు వినిపిస్తుంది.]

'ఊళ్లో ప్లేగులేదు. ఎవరూ ఊరునదలరాదు. జాతర చాలా వైభవంగా జరుగుతుంది. పరాయిఊళ్లోనుంచి జనం రావాలి.' అని వార్తాపత్రికలలో ప్రకటించండి. జనం రావడానికి అడ్డంలేదని ఇక్కడ సర్కారు డాక్టరు గారి అభిప్రాయమనికూడా వ్రాసివేయండి.

డాక్టరు : నేను అలా చెప్పలేదండి దొరగారూ!

దొర : అలా చెప్పింది నేను. మీరుకాదు – నాకు తెలుసు. మీకు బుద్ధిఉంటే నాలాగే చెప్పేవారు; జాతర జరుగక పోతే ఖజానాకు వేలకువేలు రూపాయలు రావు. దేవునికి పూజఉండదు. జీతంలేకుండాపనిచేసేవాళ్ళు చావాలి. మీ అభిప్రాయంప్రకారమే కానీండి; ప్లేగు ఉంటే అనుకుందాం. ఎంతమంది మరణించవచ్చు? ప్లేగులేక పోయినా కొందరుజనం చావనేచస్తారు; తర్వాత కొందరు ముసలివాళ్ళు చస్తారనుకుందాము; ముసలివాళ్లు చస్తే, చెత్త తొలగిపోయినట్లు; ఆమీద కొందరు ఆడవాళ్ళు చావనచ్చు. వాళ్ళు ఉంటే గడించేదిలేదు,

కూడు దండగ! ఇంకా కొంతమంది చిన్నపిల్లలు చావ వచ్చు; పిల్లవాళ్ళు చచ్చినా ఉయ్యాలలేమీ ఖాళీకావు. హిందూదేశం జనాభాలెక్కలు విన్నారా? పది సంవత్స రాలలో 33కోట్లు 43కోట్లు అయింది.

డాక్టరు : బీదాసాదాగతి యేమిటి దొరగారూ?

దొర : బతకడం కష్టమైనప్పుడు చావడమే సుఖం వాళ్ళకు; చస్తే చింతే ఉండదు.

డాక్టరు : అది సరేలెండి దొరగారూ, డబ్బుగలవాళ్ళైన రైనా......

దొర : వాళ్ళలో ఎవరు చస్తేఏమిటి? డబ్బు ఉండేదికాదు! వాళ్ళు దొంగలకు ముచ్చులకూ భయపడాలి. రోగ భయమే వాళ్ళకెప్పుడూను! పెద్దవాళ్ళు చస్తే చిన్న వాడికి ఆస్తి చేతికి వస్తుంది; పిల్లవాళ్ళు చస్తే భాగం మిగిలిపోతుంది.

డాక్టరు : దొరగారూ, తమహృదయం రాతిగుండె అయి పోయింది.

దొర : డాక్టరుగారూ! ధర్మం! ధర్మం! డాక్టరుగారూ! ధర్మం నిలవరాదు. దేవపూజ, ఉత్సవం కొనసాగాలి. అంతకూ మీరి కొన్ని ప్రాణులు చస్తాయనండి. దానిని సహించకతప్పదు. జాతర నిలచిపోతే సంస్థానం గుండె నిలిచిపోయినట్టు. యజమానిజీతం నిలిచిపోతే, ఇం ట్లోవాళ్ళు తినేదేమిటి? ఇప్పుడైనా తెలిసిందా? ప్లేగు లేదు – కానా డాక్టరుగారూ?

[గుమాస్తా దివాంజీచేతికి తంతి అందిస్తాడు]

దివాంజీ : బొంబాయినుంచి తంతి వచ్చిందండయ్యా.

డాక్టరు : సమయానికి వచ్చింది.

దొర : సర్కారు వైద్యశాఖవారు ఏమంటారు ?

దివాంజీ : (గాబరాతో) "Rats plague infected"-ఎలుకలు ప్లేగుగంట్లవేనట దొరగారూ.

దొర : (కోపంతో చింపిపారేయండి ఆ కాయితం. (దివాంజీ వెంటనే అలాచేస్తాడు). ఇక్కడి ఎలుకలసంగతి ఢిల్లీకేమి తెలుస్తుంది? దివాంజీ, ఊరిబైటి ఏడ్డైవాళ్లు ఉన్నారా, అందరూ చచ్చారా ? వాళ్లు రోజూ ఎలుకలనే తింటారుకదా ! అదే నిజమైన పరీక్ష. బొంబాయికి ఏమి తెలుస్తుంది ?

దివాంజీ : వాళ్లలో ఎవళ్లైనా చచ్చిఉంటేనండీ ఇక్కడికి ఏడ్పు వినిపించేదండీ. మరేమిటి? అందరూ చావడం వల్ల ఎవరూ ఏడవడంలేదో ఏమో ! బ్రతికిఉండేవాళ్లు కదా చచ్చినవాళ్లకోసం ఏడవాలి !

దొర : ఆ సంశయం వద్దు. అలా ఉంటే ఊరికిఊరే బొబ్బలు పెట్టేది. ఊళ్లో ప్లేగులేదు. ఇదే నిజం జాతర జరిగితీరాలి. ఔనునండి డాక్టరుగారూ !

[వెలుపల దూరంలో "అయ్యో మహారాజా !" అనే ధ్వని వినబడుతుంది.]

ఏమి టీ కేకలు ?

గుమాస్తా : ఎవడో శూద్రుడు ప్లేగుతో మరణించాడటండీ దొరగారూ !

దొర : ఎవరన్నారు ప్లేగని! ఈ రాచనగరులో నా ఆజ్ఞ లేనిదే ప్లేగూ రాకూడదు; ఎవరూ రాకూడదు. నేను "ప్లేగు ఉంది" అనేవరకూ, ఎవ్వరూ 'ప్లేగు' అనేమాటే ఎత్తకూడదు. దివాంజీ, ఏమి టా గోల వెలుపల!

దివాంజీ : ఎవరో మరణించిఉండాలండీ.

దొర : ఏమైందట?

దివాంజీ : వట్టి ప్రాణంఒకటి పోయిఉండాలి! అంతేనండీ!

దొర : గంట్లు పుట్టాయా వాడికి?

దివాంజీ : పుట్టినా కురుపులో, బిళ్లలో అయిఉంటాయండీ.

డాక్టరు : కురుపులవల్లా, బిళ్లలవల్లా ఎవరూ చావరండీ.

దొర : బలే, పెద్ద పరిశోధనచేశారు! చావకూడదనుకున్న వాళ్ళు కురుపులు, బిళ్లలు లేచేట్టు చేసుకోంటేసరి అనండి! బలే డాక్టరు!

డాక్టరు : నేను అలా అనలేదు దొరగారూ! వట్టి కురుపులు బిళ్లలవల్ల ఎవరూ మరణించరు అన్నాను.

దొర : అది సరేలే. దేనినుంచి చచ్చిఉంటారో చెప్పండి.

డాక్టరు : చూడకుండా పెట్టకుండా చెప్పడానికి నే నేమి జ్యోస్యుణ్ణా దొరగారూ?

దొర : ఇది చెప్పడానికి జ్యోతిష మెందుకు? ఎవరో ఏడ్చారు అన్నమీదట మరొకరెవరో చచ్చారు. ఈ తర్కం సరైందేకదా! కారణంలేకుండా చచ్చిఉండరు. దివాంజీ చెబుతున్నారు ప్రాణంపోయిఉండాలని. దాని కూడా కారణమేమిటి?

డాక్టరు : సర్కారువారు ప్లేగులేదు అన్నప్పుడు తనకు ఎక్కడినుంచి ఈ గంట్లువచ్చాయో అని అదరిపడి మరణించిఉండాలి.

దొర : సెబాష్ డాక్టరుగారూ! మీరు చెప్పిందే సరి. ఊళ్ళో జనం ప్లేగుభయంతో చస్తున్నారు – ప్లేగుతో కాదు. దివాంజీ, దండోరా వేయించండి. "ఊళ్ళో ప్లేగు లేదు. ప్లేగుకు ఎవరూ భయపడగూడదు. చచ్చినా భయపడరాదు. జాతర వైభవంగా జరుగుతుంది." అని చాటించండి.

దీవాంజీ : చిత్తం, అలాగేనండి.

(గుమాస్తాకు సైగచేస్తాడు. గుమాస్తా లోపలికిసైగచేస్తాడు వెంటనే దండోరామనిషి చాటింపు వినబడుతుంది. "వినండయ్యో వినండి. సర్కారు దండోరా. ఊళ్ళో ప్లేగు లేదు. ప్లేక్కుఎవ్వరూ బెదరకూడదు. చచ్చినా బెదరకూడదు. జాతర జరిగి తీరుతుంది." డప్పు చప్పుడు. అది నిలిచిన మీదట "అయ్యో మా రాజా" అని ఏడుపువినిపిస్తుంది.)

దొర : మళ్ళా ఎవరు చచ్చారు? ఏడిస్తేమాత్రం చచ్చినవారు లేచివస్తారా? ఈ అవివేకులకు ఏమీ తెలీదు. డాక్టరుగారూ, వీడు ఎందుకు చచ్చిఉంటాడు?

డాక్టరు : వెనకటివాడు చచ్చినప్పుడు తక్కినవారు ఏడ్వడం విని వీడు గుండె పగిలి చచ్చిఉండాలి.

దొర : సహావ్వా డాక్టరుగారూ! మీరు పెద్ద గండంలాంటి సమయంలో నాకు పెద్ద సహాయంచేస్తున్నారు. దీవాంజీ!

ఎవరు చచ్చినా ఎవరూ ఏడవకూడదు— ఈ జాతర అయ్యేవరకూ అని దండోరా వేయించమని చెప్పండి.

(దివాంజీ గుమాస్తాకు సైగచేస్తాడు. గుమాస్తా లోపలికి సైగచేస్తాడు. వెంటనే దండోరా మనిషి చాటింపు వినబడుతుంది. డప్పుచప్పుడు : తర్వాత "వినండయ్యో వినండి. సర్కారు చాటింపు. జాతర జరిగి తీరుతుంది. ఈలోపల ఎవరుచచ్చినా ఎవరూ ఏడ్వ రాదంటయ్యో ఏడ్వరాదు." మళ్ళీ డప్పు చప్పుడు.)

నాకు జాతరచింత; జనానికి చచ్చే తొందర.

గుమాస్తా : చిత్తం. కొందరు ఊరువిడిచి పోతున్నారు; వాళ్ళ బళ్ళను అధికారులు అటకాయించారట; ఏమి చేయమని సెలవు ?

దొర : ఆ జనాన్ని ఊళ్ళోకి పంపినేయమని చెప్పండి. ఊరి వాళ్లే భయపడి పరుగెత్తిపోతే, పరాయిఊళ్ళవాళ్లు ఎలా వచ్చి చస్తారు ? అదేమీ పనికిరాదు. "ఊళ్లో ప్లేగు లేదు. ప్లేగుకు ఎవరూ భయపడరాదు. భయపడితే చస్తారు. చచ్చినా ఏడవరాదు." అని ఊరిజనానికి తెలిసే లాగా దండోరా వేయించండి.

(దివాంజీ గుమాస్తాకు సైగచేస్తాడు. గుమాస్తా లోపలికి సైగచేస్తాడు. వెంటనే దండోరా మనిషి చాటింపు వినబడుతుంది. డప్పు చప్పుడు: తర్వాత ఊళ్ళో ప్లేగు లేదు. ప్లేగుకు ఎవరూ బెదరకూడదు. బెదిరితే చస్తారు. చచ్చినా ఏడవకూడదయ్యో ఏడవకూడదు. డప్పు చప్పుడు. తర్వాత ఒక సిపాయి గుమాస్తాకు ఒక కాయి

తం అందిస్తాడు. గుమాస్తా దానిని దివాంజీచేతికి ఇస్తాడు.)

దివాంజీ : (చేతిలోనికాయితం చూస్తూ) పొద్దుటినించి ఐదు మంది మరణించారట! కారణం తెలియదు అని అంటున్నారండీ సర్కారు అధికారులు,

దొర : ఆశ్చర్యం! ఆశ్చర్యం! ఎంత తొందర? ఎంత తొందర? ఈ చచ్చే మహారాజులు జాతరఅయ్యేవరకు కాస్త ఓపికపడితే ప్రాణాలు ఎగిరిపోయేవా? జనానికి తెలివి తేటలే తక్కువ. ఏమిటి? యమునిఊళ్లోనూ జాతరజరుగుతున్నదా? ఇదంతా వింటూంటే నా తల వేడెక్కింది. ఏమిటి? కారణమేమిటంటారు డాక్టరు గారూ?

డాక్టరు : ఒకటి ప్లేగు –

దొర : ఛీ! ఛీ! నేను దానిని ఒప్పుకోను.

డాక్టరు : మరోటి, ఉదయంనుంచి ఎడ తెరిపిలేకుండా దండోరా విని విని జనం ప్రాణాలు పోగొట్టుకుంటున్నారేమోనండి!

దొర : హాస్యంచేయడంలేదుకదా డాక్టరుగారూ! దివాంజీ, డాక్టరుగారు అన్నది బాగుందంటావా?

దివాంజీ : చిత్తం. ఎందుకు ఉండరాదు? ప్లేగు ఉండవచ్చునసే అబద్ధపు బెదురుతో జనం గుండెలుకొట్టుకొంటూ ఉండాలి. తమ నోటినుంచి ఎక్కడ ప్లేగనేమాట అబద్ధంగానైనా జారిపోతుందోఅని నిజంగానే భయంపుట్టి, గుండెలు మరింత కొట్టుకుంటూఉండాలి. గుండెకొట్టుకునే

ధ్వనితో పైనుంచివచ్చే దండోరాధ్వని చేరి దండోరా చప్పుడో గుండెచప్పుడో తెలియక గుండెలుకొట్టుకొని కొట్టుకొని ప్రాణాలుఎగిరి, మనుష్యులుకూడా బంతుల్లాగా ఎగిరిపడుతూఉండవచ్చు దొరగారూ !

దొర : డాక్టరుగారూ, ఇది నిజమేనంటారా ?

డాక్టరు : నిజంగానే ఉంటే ఇలా ఉండాలని మా వాదం దొరగారూ !

దొర : ఇదంతా విని, నా గుండె కొట్టుకుంటూంది.

డాక్టరు : జాతర ఆలోచనతో అలా అయివుంటుందండీ. నిజంగా మీ గుండెలు ఎగిరెగిరిపడాలి దొరగారూ!

దొర : (నాసలు తాకుతూ) నా నాసలు వేడెక్కినట్టుఉంది. దండోరా వేయించడం ఇక వద్దని చెప్పండి. జాతరకు ఏర్పాట్లన్నీ సాగనీండి. జాతర తప్పకుండా జరగాలి. డాక్టరుగారూ, నా ఒళ్ళు వేడెక్కిందేమో చూడండి.

డాక్టరు : (చూచి) దొరలదేహం వెచ్చగానే ఉండాలి.

దొర : (తననాడి తానే చూచుకొని) నా నాడి ఇంతగా కొట్టుకుంటూందేం ?

డాక్టరు : రాజనాడి. అడిగేదేమిటి ? రణాంగణానికి బయలుదేరిన గుర్రంలా కదంతొక్కుతూందండీ.

దొర : నా దేహం ఎందుకో వణికిపోతూందే !

డాక్టరు : దొరగారూ, అది జాతర ఉత్సాహం.

గుమాస్తా : ( సిపాయి పిలుపు విని లోపలికి వెళ్ళి వచ్చి) దొరగారూ తెలుగువారిసందులో ఇద్దరు బడుగు

బాపలు చచ్చిపోయారట. వారింట్లోనూ ఏ గంట్లూ (ముల్లెలూ) లేవటండీ !

దొర : మన ఇల్లేమిటి రాచయిల్లా లేక యమరాజు సుంకపు టిల్లా ? చచ్చినవారిని శ్మశానపు దారిపట్టుమనండి ఊరికే. ఒక్క కూలివాడు చచ్చినా ఇక్కడ ఎందుకూగోల? ఒక్కఎలుక చచ్చినా ఇక్కడ గోలా? ఊరంతాచచ్చినా జాతర ఆగదు. ఎవరు చచ్చినాసరే ఇక నాకు తెలుపకండి. నేను వినలేను.

[ సిపాయిపిలుపు విని గుమాస్తా లోపలికివెళ్ళి తిరిగివచ్చి దివాంజీ చెవిలో గుసగుసలాడుతాడు.]

దివాంజీ : దొరగారూ, ఆవైపు గదిమధ్యన ఒక ఎలుక ఊరికే పడివుందటండీ.

దొర : చచ్చిందా?

దివాంజీ : ఏమో తెలీదండి. ఎవరి అడుగుల చప్పుడుకూ అది బెదిరి కదలడంలేదుట !

దొర : చప్పుడుచేయకుండావుంటే అది ధైర్యంగా వెళ్ళిపో వచ్చుకదా!

దివాంజీ : చిత్తం. అది జంతువు. దానికి అంత వివేకం ఉన్నట్టు తోచదండీ.

దొర : పిల్లిని వదలిచూచారా?

దివాంజీ : ఆ ఎలుక పడేవేళకు గదిలోనుంచి పరిగెత్తిపోయిన రెండుపిల్లులు మళ్ళీ పత్తాలేవుటండీ.

దొర : ఆ ఎలుకలను ఇప్పటికిప్పుడే తంతిద్వారా మద్రాసుకు పంపండి.

డాక్టరు : చిత్తం; వైర్‌లెస్‌లో పంపితే మంచిదికాదటండీ?

దొర : మీకు వెర్రి డాక్టరుగారూ! అది ఎలా సాధ్యం?

డాక్టరు : తమరు చెప్పినట్టు తంతిలోమాత్రం సాధ్యమా దొరగారూ?

దొర : (ఉద్వేగంతో) నేను అలా చెప్పానా? నా మనస్సు స్థిమితంగా లేదు. దివాంజీ, ఆ ఎలుకకు అంత్యక్రియలు జరిపించండి. (దివాంజీ వెళతాడు.) డాక్టరుగారూ! నాకు జ్వరం వచ్చిందేమో?

డాక్టరు : ఆవిధంగానే తోస్తూవుండాలండీ దొరగారూ.

దొర : ఇది ప్లేగుజ్వరంగా ఉండివుండదు కదూ?

డాక్టరు : తాము దొరలు; సామాన్యజనులలాగ చెబుతూంటే ఎలా? ప్లేగే లేనప్పుడు ప్లేగుజ్వరమా?

దొర : మీకు ప్లేగుభయం లేదా?

డాక్టరు : చిత్తం. లేదండి. నేను ప్లేగు ఇంజక్షనులు వేయించుకున్నానండి.

దొర : ఎందుకు వేయించుకున్నారు, ప్లేగు లేకుండా ఊరికేనా ?

డాక్టరు : ఆ ఆలోచననే వేయించుకున్న తర్వాత నాకూ కలిగిందండీ.

దొర : (ఆత్రంతో) నాకుకూడా ప్లేగుఇంజక్షనులు వేస్తారా డాక్టరుగారూ?

డాక్టరు : ఊరికేనే ఎందుకండీ దొరగారూ.

[ దివాంజీ తిరిగివస్తాడు. ]

దొర : ఆ ఎలుక పడినప్పటినించి నా మనస్సుకు భయంగా వుంది.

డాక్టరు : ఆ ఎలుక ప్లేగుఎలుకై వుండదండీ.

దొర : ఏ దేవుడు చెప్పాడండీ మీకు అలాఅని?

డాక్టరు : "రాజా ప్రత్యక్షదేవతా!" వేరే యెవరు? ఊరిలోనే ప్లేగుఎలుకలు లేనప్పుడు దొరగారి నగరులోకి ఎలా వస్తాయండి?

దొర : అయితే మీరే మొదట చెప్పలేదూ ప్లేగు ఎలుకలు ఉన్నాయని?

డాక్టరు : చిత్తం. అప్పుడు నాకు బుద్ధిలేదండి.

దొర : బొంబాయి సర్కారు వైద్యశాఖవారూ అలాగే వ్రాశారు గదా! దివాంజీ అంతేకాదూ?

దివాంజీ : చిత్తం. వారేమో అలాగే అన్నారండీ.

డాక్టరు : లోగుట్టు పెరుమాళ్ళ కెరుక! దొరగారి ఎలుకల సంగతి దొరగారికే తెలుసు.

దివాంజీ : (చేతిలోని ఒక కాగితం చూచి) ఏదో పత్రికలో "ఆ వెర్రిపాలెంలో జాతరకు సన్నాహం హెచ్చుగా జరిగింది; ఊరిలో రోగమూ హెచ్చవుతున్నది" అనేవార్త ప్రకటించబడిందటండీ.

దొర : (కోపంతో) ఏమి ముద్రారాక్షస మిది? దయ్యమంత తప్పు! ఇంకేమి చావాలి? ఆ పత్రికకు సవరణ పంపండి. రోగంకాదు, యోగమని. రోగంట! రోగం! సంపాదకుల కేముంది! రోగమూ వార్తే, యోగమూ

వార్తే. వారి ముల్లేమిపోతుంది? (ఒక్కసారిగా నిస్తేజుడైపోయి) నా చేతులూకాళ్లూ పోయాయి డాక్టరుగారూ!

డాక్టరు : దొరగారూ, తాము ధైర్యవంతులు. ఒక్కమాట మీద నిలిచేవారు. ఆడినమాట తప్పే తత్వం కాదు తమది.

దొర : పోయి మంచంమీద పడిపోవాలని అనిపిస్తూందండీ.

డాక్టరు : తాము పడిపోతే, జాతరకూడా పడిపోతుంది దొరగారూ.

దొర : తల తిరుగుతూందండీ !

డాక్టరు : చిత్తం. తమ ఆలోచనల ప్రభావం అంతే.

దొర : కండ్లు గుండిపోతున్నాయి.

డాక్టరు : చిత్తం, తమదృష్టి అంత తీక్ష్ణం.

దొర : నోరు ఆరిపోతున్నది.

డాక్టరు : ఏమీ ఫరవాలేదండీ దొరగారూ.

దొర : డాక్టరుగారూ; మీ శాంతం నేను సహించలేను. నా కేమోఅయింది. పరీక్షించిచూడండి.

డాక్టరు : పరీక్షించి ఏమి చూడమంటారు దొరగారూ? పైనే తెలుస్తున్నది. చచ్చినవారి వార్తలు ఉదయంనుంచి వినివిని భ్రమకలిగి ఉంటుందండీ.

దొర : అలా అంటే ఎలా ? ప్లేగు అనేనా ?

డాక్టరు : ఆమాట నేను అనలేనండీ ! దొరగారు చెప్పవచ్చునండీ.

దొర : (ప్రక్కమీదికి పొర్లుతూ) డాక్టరుగారూ, ప్లేగనే మాటకు ఎంత భయపడుతున్నారు ?

డాక్టరు : నాకు ప్లేగుభయం లేదండీ. మీ భయమేసండి.

దొర : భయపడకుండా చెప్పండి; నాకు ఏమైఉంటుంది ?

డాక్టరు : ప్లేగండీ.

దొర : (ఒక్కసారిగా లేచి) నాకు ప్లేగు తగిలిందా ? (వికారంగా) ఊళ్లోని ఎలుకలన్నింటినీ చంపివేయండి. దివాంజీ, ఎలుకలు ఎక్కడున్నాయి ? (పక్కమీదికి వాలిపోతాడు.)

దివాంజీ : చిత్తం. దొరసానిగారు లోపలికి రావడానికి అనుమతికోసం కాచుకునివున్నారండీ. జనం ఊరువిడువడానికి కాచుకుని ఉన్నారండీ.

దొర : దివాంజీ, ఇక నేమి దేవునిజాతరో; దొరగారి ప్రేత యాత్రో ! డాక్టరుగారూ ఊరుజనానికి ఊరువదలమని చెప్పండి; జీవునియాత్ర జరుగనీయండి డాక్టరుగారూ. మీకు బుద్ధిలేదు. భయపెడితే భయపడిపోతారు. చచ్చినా సత్యం వదలరాదు. నేను చెబుతున్నాను— ఇది ప్లేగు.

డాక్టరు : సర్కారు చెప్పిందే సత్యం దొరగారూ.

[దివాంజీ ఈ విషయం తెలుపడానికి వెళతాడు. లోపల 'మన మహారాజుగారు బహుకాలం మనాలి' అంటూ జనసమూహం నినాదాలు వినిపిస్తాయి.]

—. తెర :—

# వార్షికోత్సవం

రచయిత:

శ్రీ 'పర్వతవాణి'

[పర్వతవాణి నరసింగరావుగారి కావ్య నామధేయం "పర్వతవాణి". వీరు పెక్కు నాటకాలు రచించారు. రచించిన నాటకాలలో పెక్కు రంగస్థలం ఆరోహించి జన ప్రియమయాయి. "బలానికి ఇవతలిమందూ ఉండనీ, వెలుపలి హిమోగ్లాబిన్ కూడా ఉండనీ. పాపాయి పుష్టి పొందనీ," అనే దృష్టిగల వీరు ప్రసిద్ధాంగ్ల హాస్యప్రధాన నాటకాలను కన్నడంచేశారు. ఇటీవల స్వతంత్రనాటకాలూ రచించారు. "వార్షికోత్సవం" ప్రముఖ రష్యన్ రచయిత చెకోవ్ "అనివర్సరీ"తో ప్రేరితమైంది.]

## పాత్రలు

విక్రమ్ ... జనరల్ మేనేజరు,
లక్ష్మీబ్యాంక్ లిమిటెడ్.

రత్నం ... ఆయన ధర్మపత్ని

రంగన్న ... బ్యాంక్ హెడ్ అకౌంటెంట్

పార్వతమ్మ ... ఒకావిడ

బ్యాంక్ కాషియరు — గుమాస్తా

దర్వాన్ సింగు — ప్రతినిధివర్గసభ్యుడు

దృశ్యం – బ్యాంక్ జనరల్ మేనేజరు ఆఫీసు గది

వ్యాప్తి: ... ముప్పావుగంట

# వార్షికోత్సవం

[లక్ష్మీబ్యాంక్ లిమిటెడ్, జనరల్ మేనేజరు విక్రమ్‌గారి ఆఫీసు గది. ఎడమవైపు తలుపు అవతల బ్యాంకు. వెనుకతలుపుఅవతల డైరెక్టర్ల మీటింగుగది. వారు బ్యాంకి వార్షికోత్సవంసందర్భంగా విక్రమ్‌ను అభినందిస్తున్నారు. మాటలు, నవ్వులు, కరతాళధ్వనులు ఇత్యాదులు వినబడుతాయి. ఎడమవైపు తలుపుదగ్గర నిలబడి, హెడ్‌అకౌంటెంట్ రంగన్న అవతలఉన్న ఇతరోద్యోగులతో]

రంగన్న : ఏమండోయ్, ఏమండోయ్, సారిడాన్, సారిడాన్ అని వేయిసార్లు నాలుకపీక్కున్నాను? చుట్టూ చీమలపుట్టంతమంది ఉన్నారు. ఒక్కడిచెవుల్లోను పడలేదేమండీ, నా అరుపులు? ఏమండీ క్యాషియర్, మీకు మీ దొరగారికి ప్రతి పావుగంటకూ కాఫీ, సిగరెట్ తెప్పించటంలోఉన్న శ్రద్ధ, ఉత్సాహం, ఆ దొరగారితలలో మెదడునింపడానికి ఇక్కడఉన్న ఈ హెడ్ అకౌంటెంట్ రంగన్నతల పగిలిపోతున్నా కాస్త సారిడాన్ తెప్పించమనేసరికి ఎక్కడ మాయమైపోతాయమ్మా? జాగ్రత్త! వచ్చేనెల మీ ఇంక్రిమెంటు— ఇంకా నా కలానికి జీవంఉంది. తక్షణం పంపండి. దానితోపాటు ఇన్ని నీళ్ళైనా పంపండి...

(వెనక్కు తిరుగుతూ)

ఆటలు! అక్కడ ఆటలాడుతారు మీరు అలంకారం చేసుకొని, నేను ఛస్తూంటా నిక్కడ. పాడైంది, ముక్కు-

పోతున్న ఈ దేహం, అయినా ప్రారబ్ధకర్మ ఎక్కాలు మరచిపోవు.

(తనకుర్చీలో కూచుంటూ)

ఈ అనిష్టంనుంచి నాకు ఎప్పుడు విరుగడో తెలీదు;

(నశ్యండబ్బీ లాక్కుని)

వీళ్ళకు వార్షికోత్సవం, నాకు వర్షాబ్దికం.

(లోపల డైరెక్టర్లకరతాళ ధ్వనులు)

తట్టండి తట్టండి చేతులు. తట్టలకు తట్టలు ఫలహారాలు ఖాళీచేస్తూ, అదేమి డైరెక్టర్లో! అదేమి మీ మేనేజరుకు గౌరవమో! అదెంత పూయించుకుంటారో మంకుమసి అతనిచేతుల్తో! మీారే ఈ లక్షణం! ఇక సాయంకాలం జనరల్‌బాడీ. పాపం! హెడ్ లేని వట్టి బాడీ. దానిముందు ఇతని ప్రసంగం. "బ్యాంకు వెనుక – నేడు – ముందు" విషయం. నిప్పాపెట్టు వీని యోగ్యతకు. నేడు పందిలాగ పెరిగున్నాడుకాని, బ్యాంకు వెనుకేమి కన్నాడు, ముందేమికన్నాడు, కావలావారిగూడు, నీటితొట్టి తప్ప! వీడుచేసే అమోఘభాషణానికి అన్ని అంకెలు, అంశాలు నింపి ఒక డ్రాఫ్టు వ్రాసిపెడ్తే తక్కిందంతా చేసుకుంటాడట వీడు! ఏమ్మిగిలింది– వీడు చేసుకునేది? వీడిపిండా కూడు! ఈ కామాతీసి అక్కడ పెట్టాడు. ఆ ఫుల్‌స్టాప్ తీసి ఇక్కడ పెట్టాడు. నా ఇన్ని ళ్ళన్నీ రబ్బరుతో చెరిపి పెన్నుతో తనసంతకం గీకాడు; ఆ ఆడకైపిస్టును పిళి

పించి టపటపా అనిపించుకొని దాచుకున్నాడు; ఆ షేర్ హోల్డర్స్ గొఱ్ఱెలముందు గడగడా కక్కేశాడు. పూలహారాలు వేయించుకొన్నాడు; బొకేలు పుచ్చుకున్నాడు; తన మీసాల అలవెన్సు అని వ్యాన్ లైన్ కోసమూ, తన పెళ్ళాం కొప్పు అలవెన్సు అని హేర్ పిన్నులకోసమూ, అలవెన్సు నూటరూపాయలు హెచ్చించుకొన్నాడు; మీసం తిప్పుకున్నాడు. "ఎవర్నేను, విక్రమ్" అని! ముగిసిపోయింది వీడి వార్షికోత్సవం! ఈ ఉత్సవమూర్తి విక్రమాదిత్యుని వైభవం విజృంభణలో నేనిక్కడ దగ్గుకుంటూ, మూల్గుకుంటూ, ఛస్తూ పడుతూ, పగలంతా ఇక్కడ, రాత్రంతా ఇంట్లో కళ్ళకు కలికం పెట్టుకుని, కూడిందే పదింటికీ ఒకటి, ఇరవైయింటికీ రెండు అంటూ రూపాయణా పైసలను - కాయితాలమీంద. పాడైపోనీ, నాపాటికి నేను ఊపిరి వదులుకుందామూ అంటే ఆ పాణిగృహీతి పిశాచి శాంపు, "దీపం ఆర్పండీ అంటే, నాకు నిద్ర రాదూ" అని. గుమాస్తాల కసలు పెళ్ళాలెందుకో నాకైతే అర్థం కాదు. ( నిట్టూరుస్తూ )

హుఁ... హుఁ... దేవుడు ఎంత అదిమి అదిమి పెట్టాడో నాకు ఆయుస్సు; ఈ కర్మఫలం ఇంకా ఎంత అనుభవించాలో!

( హాడుం పీలుస్తూ )

రెండు మూడు ఐదు ఆరు పదకొండు ఎనిమిదీ పదిహేడు, ఏడు కేడు పదికి ఒకటి......

( యోచిస్తూ )

ఏమో చూద్దాం, "అంతా పూర్తిఅయాక మున్నూరు రూపాయలు బోనస్సు ఇప్పిస్తాను" అన్నాడుకదా, వరాహమూర్తి! నిజంగా ఇప్పిస్తాడో, అది గానుగెద్దు ముక్కుకు పనసపండో, చూద్దాం......

( అంకెలు కూడుతూ )

ఒకటీ, ఒకటీ ఎనిమిదీ తొమ్మిది పదిహేను......

(యోచిస్తూ)

ఆఁ... పనసపండా? ఇవ్వకుండా పోనీ... వయస్సు అరవై అయినా, పుట్టింది ఆరో నెలలో. లెక్కా గిక్కా చిందరవందరచేసి, తలపైన అభిషేకించి అవతలికి వెళ్ళి పోయానూ అంటే, ఆరువందలమంది అకౌంటెంట్లు రానీండి? తల్లక్రిందులుగా ఎగిరి మొగ్గ వేయనీండి! లారీ లేక్కాని వెదుక్కుంటూ రారూ ఈ లక్ష్మీబ్యాంక్ డైరక్టర్లు డైరక్టర్లే సీగేచేలిసందుకు, మాయింటికి "రంగన్న గారూ" అంటూ తలుపుతడుతూ, వెండిపళ్ళెంలో మున్నూరు, మీద ఇన్నూరు తప్పా కానుక పెట్టుకొని? హూఁ.

[ డైరక్టర్ల చప్పట్లు విని రేగిపోయి, తనూ రెండుచేతులూ మీది కెత్తి చప్పట్లు చరుస్తూ ]

హుఁ హుఁ. చేర్చుకోండి,చేర్చుకోండి, నా చప్పట్లూ! (నొసలు కొట్టుకుంటూ) హాయ్యో, హాయ్యో డైరెక్టర్లూ! డైరెక్టర్లూ! బస్సుకండక్టర్లయినా......

విక్రమ్: (లోపల)మంచిది మంచిది. తమ అభిమానం(వెనుక

వైపు తలుపువద్దకువచ్చి) నమస్కారం. (చంకలో వుండే గంధపుకర్ర పెట్టెను చూపుతూ) మీరుచేసిన గౌరవాన్ని నా జన్మపర్యంతం స్మరిస్తూవుంటాను. (ముందుకు వినయంగా ఒంగుతాడు. చప్పట్లు. మళ్ళీవంగి, వెనక్కు తిరిగి, రంగన్నవైపు రాగా, రంగన్నలేచి నిలబడగా ) హల్లో! రంగన్నగారూ! (కబ్బన్ ప్రతిమలాగ నిలబడి) ఎలావుంది? (నవ్వు విరజిమ్ముతాడు.)

రంగన్న : చాల బాగుంది సార్. పూలహారాలు, బొకే, చందనపు కర్రపెట్టె- దంతపు పనితనం చాల బాగుంది సార్.

విక్రమ్ : (నవ్వి) ఎవరికోసం బాగుంటుంది? (మీసం మెలివేస్తూ) ఎవరన్నను, విక్రమ్! రంగన్నగారూ, ఈ వార్షికోత్సవం గుర్తుకోసం – నాకు చాల ఆనందమైపోయింది. ఈ దినం, మీ ఒళ్ళుతాకి వీపు తడుతాను. (వీపు తడుతూండగా)

రంగన్న : భూమిదేవీ, నోరు తెరు. నే నిక బ్రతకనక్కరలేదు.

విక్రమ్ : రంగన్నగారూ!

రంగన్న : అంతకాక మరేమి సార్? నిత్యం పొట్టమీదపడుతూన్న సెబాష్‌లు నేడు వీపక్కెనతర్వాత, భూమిమ్మీద ఇంకా బ్రతికి ఏంకావాలి సార్?

విక్రమ్ : (నవ్వి) ఏమైనా, కుట్టకుండా వదలరుకదా మీరు! అదికాదండీ, రంగన్నగారూ, భూమిదేవి నోరు తెరిస్తే మాత్రం బ్యాంకు వదులుతుందా మిమ్మల్ని? ఆ, ఇంకా మీ సేవ ఎంతకావలసివుంది దీనికి, ఏంకథా! చూడండి,

నేను పూలహారమైతే మీరు నార. అథవా, నేను పూలయితే, మీరు పరిమళం. వదలండి రంగన్నగారూ, వదలిపెట్టండి ఆ యోచన. లక్ష్మీబ్యాంకు అంటే ఢిల్లీ చెవులు వెడల్పయ్యాయట, మీ సేవే కదూ కారణం? అంటే నేను కష్టపడలేదనికాదు; పడ్డాను. పడుతూ వున్నాను. ఇంకా పడతాను. (మీసాలు మెలివేస్తూ) ఎవర్నేను? విక్రమ్! అది సరేలెండి! ఈ సాయంకాలం జనరల్ బాడీకి నా ప్రసంగం ఎంతవరకు వచ్చింది?

రంగన్న : ఇంకా రెండుమూడుపుటలు కావచ్చు. ఆటంక మేమీ లేకపోతే, పావుగంటలో పూర్తయిపోతుంది.

విక్రమ్ : భేష్...భేష్...

[ క్యాషియర్ మండిపోయేముఖంతో నీళ్లూ, సారిడానూ టేబిల్ పైన కొడుతూ ]

క్యాషియర్ : హెడ్ అకౌంటెంట్‌గారూ, సారిడానూ, నీళ్లూ.

రంగన్న : ఓ... మీరే తెచ్చారా? థ్యాంక్స్, థ్యాంక్స్.

విక్రమ్ : (వెనక్కితిరిగి, క్యాషియరుతో) ఏమండీ, క్యాషియర్, ఏమిటండీ యిది!...... సారిడాను! తలనొప్పా, రంగన్నగారూ?

రంగన్న : పగిలిపోతూఉందండీ, సార్...

విక్రమ్ : నాన్‌సెన్స్... ఏమీ అర్థంకాకుండా వుందే! నేను సాయంకాలం ప్రసంగంచేయాలి. ఇప్పుడు మీకు తలనొప్పిరావడమా? ఛి! ఛి! మరి, క్యాషియర్, పిల్చి జతకు చన్నీళ్ళు తీసుకువచ్చారేం? ఆస్థమావారికి ఏమిటి

విక్రమ్ : హూం, సరే. ఇవ్వవచ్చునసా, ఇవ్వగూడదనా, ఏమి వ్రాశారు?

గుమాస్తా : ఇవ్వవచ్చునని వ్రాసివుందండి...

విక్రమ్ : ఇవ్వండి మరి... ఊరికే ఐతే ఓఓఓ, (విసుగు చూపుతూ) తర్వాత చూడండీ, మరేకాయితాలూ తేకండి. నేను సాయంకాలానికి ఫ్రెష్‌గా వుండాలి.

గుమాస్తా : అలాగే సార్. (వెళ్ళిపోతాడు)

[ క్యాషియర్ కాఫీతెచ్చి విక్రమ్‌ముందు పెడుతాడు.]

విక్రమ్ : హాఁ...హాఁ... వారికి మొదట. పెద్దవారూ, వృద్ధులు. నాకు తర్వాత కానీ. (క్యాషియర్ ఒక కాఫీ కప్పు రంగన్న బల్లమీద పెట్టి, మరొకకప్పు తనబల్లమీద పెట్టగా) సూపర్ బార్‌దే కదూ కాఫీ?

కాషియర్ : ఔనండి సార్.

విక్రమ్ : (రుచిచూచి) స్ప్లెండిడ్......స్ప్లెండిడ్...... (తాగుతూ) చాల బాగుంది. ఇది పధ్నాలుగో గ్లాసు ఈ రోజు తాగేది. అయినా రుచి కొంచెంకూడా తగ్గలేదు. (తాగి రంగన్నతో) ఇంకా మీ గ్లాసు ఇలాగేవుందే! నేను చూడండి, ఎంత త్వరగా ముగించాను! నాకు కంటికిముందు పనివుంటే, చేతులకు ఛాందసం వుండదు. (రంగన్న అసమాధానంతో చూస్తాడు.) ఉహుఁహుఁ. నేను మిమ్మల్ని అనలేదు. తమరు నిదానంగా తాగండి, కాశంగా. మీరు వెళ్ళండి క్యాషియర్, సింగు వచ్చి తీసుకువెళ్తాడు గ్లాసు.

రంగన్న : వద్దం...డీ. (తొందరగా తాగడం మొదలుపెడుతాడు)

విక్రమ్ : ఛీ-ఛీ! వద్దండీ (కాపీయరుతో) మీరు వెళ్ళండి. (రంగన్నతో) ఛీ ఛీ, తాగనేతాగారా? ఇక్కడివ్వండి గ్లాసు, నేనే పట్టాను. సుననుంతా ఒక్కటే రంగన్న గారూ. ఎక్కడ, చూద్దాం...నరాలు ఇప్పుడు అంత ఉబ్బిలేవు. దిగులుగా ఉండాలి తలనొప్పి. ఆ సారిడాన్ దొరకడం కొంచెం కష్టమేకాని, సిద్ధౌషధం. ఎక్కడా నా ప్రసంగం! జాగ్రత. దీన్ని ముగించి నేను అఖిలభారత ఆర్థికసంఘం ప్రతినిధివర్గం వచ్చే వేళకు ఎలాఉండాలి! ఉంటాను. ఉండక ఏమిటో అంట? ఎవర్నీను, విక్రమ్! వాళ్ళు ఏది కావాలంటే అదే అడగనీ, సమాధానాలన్నీ నోళ్ళలోనుంచి నాట్యమాడుతూ ఉన్నాయి. మీరు వేసి ఇచ్చిన నోట్సును నూరుసార్లు చదివాను నిన్న. ఇక్కడి వాళ్ళను ఎలాగయినా సద్దుకోవచ్చు. ఢిల్లీ వాళ్లు అంటే... ధైర్యముగా ఉందనుకోండి. అయినా, నరాలుకొంచెం టపటప కొట్టుకుంటాయి.

రంగన్న : సాగ, మీరు ఇలా మాట్లాడుతూఉంటే, నా ప్రసంగం—తీసుకుందండి, మీ ప్రసంగం...

విక్రమ్ : ఔను, ముందుకు సాగించండి. అయితే రంగన్నగారూ, అంతా పూర్తి చేయండి ఒకసారి. నీటుగా ఉండికదూ! ఆర్థికసంఘం లోపలికి వస్తూఉండగానే వాళ్ళ మొగానికి అలాగే కొట్టివేయాలి. జనం అంటారు—నాకు కాయితాలు పత్రాలమీదకంటే బల్లలమీది ధూళి,

తలుపుచిలుకుల పాలిష్షు, నౌకర్ల నెక్ టైలు, గేటుకావలి వాని గడ్డం—వీటిపైన శ్రద్ధ జాస్తి అని; ఇవి చిన్నవిష యాలు కావు, రంగన్నగారూ. ఇంట్లో నేను ఎలాకావా లంటే అలాగే ఉంటాను...మురికిపంచో, చింపికోటో, నూనెమరకల టోపీయో......

రంగన్న : (తను పెట్టుకున్న టోపీ తాకి చూచుకొని) క్షమించండి; మీ సూటిపోటి మాటల్లో...

విక్రమ్ : ఛ, ఛ, ఛ! మీతో సూటీపోటి మాట్లా......? ఛఛఛ...నేను మీసంగతి చెప్పలేదు రంగన్నగారూ... ముక్కుమీద ఉంటుందికదా కోపం మీకు...నేను చెబుతున్నది, స్వాభావికంగా ఉండవలసింది ఎలా అని. (రంగన్న ఎనిమిదిరోజులుగా క్షౌరంచేసుకోనందువల్ల గడ్డం మాసిఉంటుంది.) నేను ఇంట్లోనే ఉండేవాణ్ణయితే, తిథి వార నక్షత్రాలు చూచే మంగలివాణ్ణి పిలిపించే వాణ్ని. బట్, ఇక్కడ అలా సాధ్యమా? ఇది బ్యాంకు! అంతా క్లీనుగా ఉండాలి. (నున్ననిగడ్డం నిమురుకుంటూ) స్మార్ట్ గా పనులు అవుతూఉండాలి...(నేలపైపడిన ఒక కాయితంముక్కను ఎత్తి మడుస్తూ) ప్రతిఒక చిన్న విష యాన్ని శ్రద్ధగా గమనిస్తూ, లోటుపాట్లను (చిత్తుకాయి తాలబుట్టలో వేస్తూ) చిత్తుకాయితాలబుట్టకు చేర్చి, బ్యాంకుగౌరవాన్ని గౌరీశంకర శిఖరానికి ఎత్తాలి. ఇంగ్లీ షులో 'టోన్'అంటారు చూడండి, అది చాల ముఖ్యం. (చూపుడువేలు ఆడిస్తూ) గౌరవధ్వని ఎలా వినిపించాలి! (తైపుకొడుతూ)అదికాదురంగన్నగారూ,ఎలాటిసమయం,

అఖిలభారత ఆర్థికసంఘం ప్రతినిధివర్గంవారు వచ్చేస్తారు ...మీరు ఈ టోపీ, మఫ్లరు, ఛి ఛి ఛి...ఒక కంబళి కోటు......

రంగన్న : క్షమించండి సార్. మీ ప్రతినిధివర్గంకన్నా యేమిటి – అఖిలభారతంకన్నా నా ఆస్థమా నాకు ముఖ్యం, క్షమించండి.

విక్రమ్ : అది సరే. అయితేమట్టుకు (మొత్తం) అందరూ ఇలా అలంకరించుకొని ఉండేటప్పుడు మీరిలా ఫొటోలో కూర్చుంటే...

రంగన్న : నేను కూర్చోనండి సార్. నాకు అక్కరలేదు మీ ఫొటో. వారు వచ్చేటప్పటికి నేను ఇక్కడ ఉండేదే లేదు. సద్యా ఈ మీ పని ముగిస్తే — ముగిసేటట్టూ లేదు మీ మాటల్లో...

విక్రమ్ : నో నో ... వేగంగా ముగించండి. మిమ్మల్ని డిస్టర్బుచేయను. ఏదీ వ్రాసినంతవరకు కాయితాలు ఇటు ఇవ్వండి. దిద్ది టైపుకుఇస్తాను, పని అవుతూ ఉంటుంది. (తీసుకుని తనబల్ల వైపు వెళ్ళుతూ) ఇదేమిటండీ. ఎన్ని పేజీలు వ్రాసేశారండీ ! టైపుచేయించినా ఆరేడుపుటలు కావచ్చు...బట్...కావాలి. అంత... జనరల్ బాడీకి తక్కువగాఉంటే తూకం చాలదు. నేను గనక మోస్తున్నాను ఈ కార్యభారం ! నాకు చాలు చాలయింది. ఎంత అలసట, ఏమిటి...ఆఁ, మా వంట వాడొకడు, ప్రారబ్ధం...నిన్న రాత్రి ఉల్లిపాయలపులుసు, బంగాళదుంపలకూర – ఇడియట్, ఆపైన ఉలవల అప్ప

డాలు చాల బాగుంటాయిలెండి!... (లెక్కలు కూడు తున్న రంగన్నతో) రంగన్నగారూ, ఎంతండీ ఇప్పుడు ఉలవల అప్పడాలు నూరు ?

రంగన్న : (ఇది చెవిలోపడనట్టే తన లెక్కలు చూసు కుంటూ) నాల్గువేల మున్నూట ఏడురూపాయలు—

విక్రమ్ : ఆఁ! ఏమిటీ, రంగన్నగారూ ?

రంగన్న : (అదరిపడి) ఆ ఏమిటీ ? ఏమైంది సార్ ?

విక్రమ్ : న...న...నాలుగువేల మున్నూట యేడురూపా యలా ? ఎక్కడైనా ఉంటుందీ ? ఒకటో ఒకటిన్నరో ఉండాలి, అంతేనండీ ... ఒంట్లో బాగాలేకపోతే మీరు...

రంగన్న : ఒకటో ఒక్కటిన్నరో! ఏమిటి సార్, మీరు చెప్పేది ? అలాఅయితే మన యీ లెడ్జర్లన్నీ అబద్ధమే ?

విక్రమ్ : లెడ్జర్లా ! కాదండీ, మన లెడ్జర్లలోకి ఎందుకువస్తా యండీ ఉలవఅప్పడాలు ?

రంగన్న : ఉలవఅప్పడాలా ! జనరల్ మేనేజరు రూముకు ఎందుకు వచ్చాయండీ సార్, ఉలవఅప్పడాలు ? ఓ, మీరు...వాటిధర అడిగారా ? నేను చెబుతున్నది సూర్యనారాయణశెట్టి అకౌంటు...

విక్రమ్ : ఓహ్! అదా! అయ్యయ్యో! అలైతే మీరు చెప్పిందే కరెక్టు. ఒకటో ఒకటిన్నరో అని వ్రాసుకో నేను! బ్యాంకుది—తలకాయ యెగిరిపోతుంది ! ఎగరక పోతుంది ! ఎవర్నేను, విక్రమ్ !

[క్యాషియర్ సంతకంకోసం ఓచర్స్ తేగా]

ఓహ్... కాదు... కాదు... నావల్లకాదు... ఇంకా రెండుపుటలుకూడా చదవలేదు...ఏమిటండి ఇవి— ?

క్యాషియర్ : వోచర్లండి.

విక్రమ్ : హుూం... వీటికీ వార్షికోత్సవంనాడే తొందరా ?

క్యాషియర్ : అకౌంటు సార్...

విక్రమ్ : ఔనౌను, తెలుసు ... అందుకోసనే సంతకం చేస్తూంది...ఇదేమిటండీ ఇది, పిన్స్ ? పిన్‌షీట్ తెప్పించారా ఇవాళ ?

క్యాషియర్ : లేదు సార్. మొన్న మీ హోమ్ ఆఫీసు గుమాస్తా తెప్పించారట పిన్నులు...... ఊరికివెళ్ళాలి అర్జెంటూ అని...

విక్రమ్ : పిన్నులు! అర్జెంటు! ఊరికివెళ్ళడం! ఏమిటండీ...

క్యాషియర్ : (గొంతు తగ్గించి) సార్ పిన్నులు, సార్... అమ్మగారు ఊరికివెళ్ళుతూ......

విక్రమ్ : ఓ, ఐ సీ...ఐ సీ...దట్ ఈజ్ ఆల్‌రైట్, దటీజ్ ఆల్‌రైట్. ఆ మీదది ఏమిటి, బంక, నాఫ్తలీను ?—

క్యాషియర్ : కాఫీ, సారిడాను...ఈరోజువి.

విక్రమ్ : (సంతకంచేస్తూ) ఓ. కె. ఓ. కె. బట్ అంతా అప్రూవ్‌డ్ దుకాణాలనుంచేకదూ తెప్పించారు? ఆడిటర్ల అవాంతరం బ్యాంకుది. చాల హుషారుగా ఉండాలి.

క్యాషియర్ : ఉన్నాము సార్. (వెళ్ళిపోతాడు)

విక్రమ్ : అబ్బ......ఖండితంగా ఇక పనిచేయడం సాధ్యం కాదు. రాత్రి ఆ భోజనం, తెల్లవారగానే స్నానం,

బ్రేక్ ఫాస్టు, మళ్ళీ భోజనం, డ్రెస్సింగు...తిరిగి ఇక్కడ లంచి...పూలహారాలు, బొకేలు, ఈ చందనంకర్ర పెట్టె...హాహాహాహా ... (ధ్వనిమార్చి) రంగన్నగారూ ...ఈ గంధపుపెట్టె ఎక్కడిదో తెలుసా? మూడు సంవత్సరాలుగా మాఇంట్లోనే ఉన్నది. ఈరోజు ఇలా వచ్చేటట్టు ఏర్పాటుచేశాను, అంతే......

రంగన్న : తెలుసు, సార్.

విక్రమ్ : మీకు తెలుసుననే నేను చెప్పింది. హాహాహాహా... వాళ్ళయి వాళ్ళే ఇచ్చేవాళ్లా దీన్ని? అంత బుద్ధిపుట్టేడుస్తుందా? కొంచెం గంధపునూనె గీసె పూయించటానికి మూడునాలుగు రూపాయలు ఖర్చయింది. అయితే, పరిణామం? పేపర్లో ఫొటో వచ్చినప్పుడు? ఇదైంది కదా, ఇంకా నేడు సాయంకాలం ఆ షేరుహోల్డర్లు నాకు ఇవ్వదలచిన వినతిపత్రం సంగతి మీకు తెలియంది కాదుగా!

రంగన్న : తెలుసు...... పోయినవారం నేనేగా వ్రాసియిచ్చింది......

విక్రమ్ : హో...అయితే, చూడండి రంగన్నగారూ, దాన్ని అలాగే కాయితంమీద ప్రింటుకొట్టించి ఇవ్వాలని అనుకున్నారట. నేనే ఒకగజంసిల్కు కొని, ఫ్రేముకు ఏర్పాటుచేసియిచ్చాను. ఇరవైఅయిదు రూపాయలు అయిందీ అనండి. కానీండి... వాళ్ళు దాన్ని అలా పట్టుకొని చదివి, నా నాకరయుగానికి సమర్పించేటప్పుడు ఎలావుంటుంది? కావాలి,.. రంగన్నగారూ, యివన్నీ

కావాలి...వాళ్ళ విసణిపత్రానికి సమాధానం, ఈ నా ప్రసంగం...ఇంకా రెండు పుటలున్నూ... నెవర్ మైండ్, మీరు వ్రాసినతర్వాతనే నేను చూచేది......

[కాలింగ్‌బెల్ కొట్టగా సింగ్ ప్రవేశం.]

సింగ్ : సాబ్ !

విక్రమ్ : రంగనాయకమ్మాకూ బులావ్.

సింగ్ : టైప్‌రైటర్, సాబ్ !

విక్రమ్ : షూ !

సింగ్ : అచ్ఛా, సాబ్. (వెళ్ళిపోబోతాడు.)

రంగన్న : ఆగవోయ్ సింగ్... (విక్రమ్‌తో) క్షమించండి, నేనే, వెళ్ళి పంపిస్తాను.

విక్రమ్ : ఎందుకు మీరు ? (సింగ్ ఎదుట ఆయన చెప్ప లేదు.) సింగ్, నీవుపోవోయ్. సరే! వచ్చినవాడివి రానే వచ్చావు... ఆ కాఫీగ్లాసులు తీసుకుపో.

సింగ్ : అచ్ఛా, సాబ్. (తీసుకుని వెళ్ళతాడు)

విక్రమ్ : రంగన్నగారూ !

రంగన్న : ఆమె లోపలికివస్తే నేను ఉండలేను. నాకు ఆమెనుచూస్తే ఒళ్ళు మండిపోతోంది. అంటే, ఆమె మీద నా కేమీ ఆగ్రహంలేదు నాకు మొత్తంమీద ఆడవాళ్ళు అంటేనే...

విక్రమ్: ఆ- యస్,యస్. అదీ మిమ్మల్ని అడుగుదామనుకు న్నాను.ఈ గలభాలో మర్చిపోయాను. కాదండీ, నిన్న రాత్రి మీరు మీపెళ్ళాన్ని రూళ్ళకర్రతీసుకుని సీగేబేలీ సందుల్లో వెంటబడి తరిమారట ? ఏమిటిది ?

రంగన్న : క్షమించండి సార్ ...మీగు ఆ ప్రశ్న అడగ దగ్గది కాదు. పొరాడండి, ఇక్కడ నేను ఈ ఆఫీసులో మీకు అత్యంత విధేయ సేవకుణ్ని. సకలసేవలగూ చేయించుకోండి, సంతోషం. అయితే, దయచేసి, మీ ఆఫీసరుగిరిని మా సీగేబేలీ సంసారంవైపు తిప్పకండి. అక్కడ నేనే ఆఫీసరుని.

విక్రమ్ : (నవ్వి) ఎవరు కాదన్నారండీ ? అది కాదు, నేను చెప్పింది, రంగన్నగారూ. నేను మిమ్మల్ని దండించ డానికిగాని, సమాధానం వినడానికిగాని, ప్రయత్నించా నని భావించకండి. పట్టి సీగేబేలీ యెందుకు ? ఆంగ్ల్యారు ఆంగ్ల్యారే. దండోరా వేయించండి. నా కేమీలేదు. అయితే, నేను మీ విచిత్రస్వభావానికి ఆశ్చర్యపడ తాను, అంతే. ఆఫీసులో ఇలాంటి సొగసైన పని చేస్తాడు మానవుడు; తక్కిన విషయాలన్నిటిలోను దయ ధర్మం నయం వినయం అన్నీ ఉన్నాయి. అయితే, ఈ ఆడవాళ్ళమాట ఎత్తితే చాలు, తక్షణం మన జాక్ ది రిప్పర్ మాదిరి అయిపోతారే. ఎందుకు ? వాళ్ళంటే మీ కెందుకు అంత కళ్ళమంట ?

రంగన్న : ఎందుకు వాళ్ళు మీ కళ్ళ కంత ఇంపో అందు కే వాళ్లు నా కళ్ళకు అంత మంట. నా అనుభవం నా స్వభావం, సార్. నాకు ఆడవాళ్ళంటే పడదు. నా అభి ప్రాయం—అన్ని అనర్థాలకూ, అందరి సర్వనాశనానికీ సంసారంలో సర్వదుఃఖానికీ ఆడవాళ్ళే కారణం అని.

విక్రమ్ : ఛీ ఛీ ఛీ ఛీ ఛీ! ఎక్కడైనా ఉందా రంగన్న

గారూ, మీ రసనేమాట? ఆడవాళ్ళంటే జీవనపు పర మాన్నంలో పంచదార; ప్రపంచపు ఉష్ణమందిరంలో ఉద్యానవనం. సంసారమనే తెప్పను నడిపించే తెరచాప వాళ్ళ చీరకొంగే; రంగన్నగారూ, అంతెందుకు, తల నొప్పికి ఆడదే సారిడాన్ ! హుఁ.

రంగన్న : క్షమించండి సార్, క్షమించండి. మీ భావతరం గాలను మీ బ్యాంకుక్వార్టర్సులో పారించండి...... అదేదో సంసారం, తెప్ప, చీర, కొంగు, తెరచాప అన్నారుకదా ! మీ తప్పును ... ఒక్క దృష్టాంతంతోనే మీకు చూపిస్తాను. పోయినఆదివారం మీచీరకొంగును ఆ డిన్నరుపార్టీకి వెంట పిలుచుకునివచ్చారు కదా, అక్కడ ఆవిడ ఊరికేఉండక, నలుగురిముందూ "పుండరీ కాక్ష బ్రహ్మాండబాయి మిల్స్ షేర్లుధర దిగిపోయింది. మీ బ్యాంకుకు చాల నష్టం అయిందంట. మావారు గాడవపడుతున్నారు" అని అనేశారుకదా.

విక్రమ్ : ఔనౌను. అదంతా విపరీతంగానే పరిణమించింది.

రంగన్న : అలా దారికిరండి. అవొకటేకాదు సార్. వారి గాలివీచినచోట ధూళే.........

విక్రమ్ : ఓ మైగాడ్ ! రంగన్నగారూ !

రంగన్న : ఎందుకు సార్ ?

విక్రమ్ : ఆవిడ...రత్నం...అదో...ఐ మీన్—మై వైఫ్ ...ఈరోజే ఊరికి వస్తానన్నది. (గడియారం చూచి) రైలువేళ అయిపోయింది...వచ్చేసిందా! ఆవిడకు తెలీదు మన కష్టనిష్ఠూరాలు. పుట్టినింటి తరిఫీతు విపరీతంగా

అజ్ఞానన్నడు స్టయిలు...ఇప్పుడు ఆర్థికసంఘు ప్రతినిధి వర్గం వస్తూండడం...ఈవిడా...ఇప్పుడే సరాసరి తీసుకుని వచ్చి...ఆవిడ ఊరికిరావడం సంతోషమే ననుకోండి...రాకుండాఉంటే, ఇంకా సంతోషంగా ఉండేది...నాకెందుకో ఇప్పుడే గుండె కొట్టుకుంటూంది. నో నో...తట్టుకోగలను. (నాదంలేని నవ్వుతో) ఎవర్నేను, విక్రమ్! (పేలవమైనధ్వనితో అని) రంగన్నగారూ! (జేబునుంచి సిగరెట్ కేసు లాక్కుని, ఒకసిగరెట్టు లాగగా, వెలుపల బ్యాంకిలో రత్నం 'లాత్రలప్ప' పాట ప్రారంభిస్తుంది.) రంగన్నగారూ! రత్నం!

రంగన్న : ముగిసింది సార్, మీ ప్రసంగం......

విక్రమ్ : అయ్యో...అలా అంటే యెలా...? ఏమైనా చేద్దాం...దయచేసి......(గాబరాలో అర్థంలేకుండా) దయచేస్తాను; ఎవర్నేను, విక్రమ్!

రత్నం : (తటాల్న తలుపుతోసి) డార్లింగ్!

విక్రమ్ : (వెనక్కి తిరిగి) ఓ!

రత్నం : డార్లింగ్! (అంటూ రెండుచేతులూ ముందుకు సాచి కౌగిలించుకోనడానికి పరిగెత్తుకొని వస్తూండగా)

విక్రమ్ : (గాబరాతో తప్పించుకొని) రత్నా రత్నా!

[ వెనుక రంగన్న ఉన్నాడని సంజ్ఞచేస్తాడు ]

రత్నం : ఓ... వారున్నారనా? యెంతసిగ్గు మీకు డార్లింగ్! నేను మీ భార్యనుకాదూ? వారూ మనపెళ్ళికి వచ్చారు కదా? అన్నట్టు...

[ రంగన్నబల్లమీద కూచుని, ఆయన వ్రాస్తున్నకలం లాక్కుని]

నను స్తేండి! మీ దగ్గు ఏమంటుంది? చ్యవనప్రాశ తీసుకుంటున్నారా?

రంగన్న : చూడండి, ఇప్పుడు పని...

రత్నం : అయ్యో, ఆగండి. దగ్గుమందు పనేమిటి? పాటేమిటి? ఇక మీరు ఏ ఔషధమూ తీసుకోకండి. (తన చేతిసంచినుంచి ఒకసీసాను లాగి చూపుతూ) దీన్ని తీసుకోండి. మా వంటవానితల్లికి మీకంటే జోరుగా ఉండేదట దగ్గు. దీన్ని తీసుకున్నారట. మూడేరోజుల్లో...

రంగన్న : (పాపం! "ఆశ") హూ! గుణమిచ్చిందా?

రత్నం : ఊహూఁ, చచ్చిపోయారు. అందుకోసమే యిది మీకు దొరికింది! (రంగన్న గాబరాగా చూచి) ఓ! అదికాదండీ. దీనివల్లనా ఆమె చనిపోయింది. త్వరగా నయంకావాలని హెచ్చుగా పుచ్చుకొని, త్వర త్వరగా ప్రాణం విడిచారట. అది ఔషధంతప్పుకాదుటలెండి. మీరు ధైర్యంగా పుచ్చుకోండి. నేను చెబుతున్నానుగా. మీ భార్య నా ఫ్రెండ్ కదండీ! అన్నట్టు భార్యఅనగానే జ్ఞాపకంవచ్చింది. ఆరోజు తెప్పించియిచ్చిన నీలంచీర తడిపారేమండీ? రంగు వెలిసిందేమండీ?

రంగన్న : షాక్!

విక్రమ్ : రత్నా, నీవిలా రా... వారిని డిస్టర్బ్ చేయకు. నా ప్రసంగం తయారుచేస్తున్నారు.

రత్నం : ఆ! ప్రసంగమా! ఎందుకు? ఎవరు చచ్చారు? రేడియోలో వినలేదే? అలాఅయితే నేను పద్యాలు వ్రాయాలి.

విక్రమ్ : ఛి ఛి ఛి! ఎవరూ చావలేదు రత్నా...మన బ్యాంకి వార్షికోత్సవం—జ్ఞాపకంలేదూ ?

రత్నం : ఆ! వార్షికోత్సవమా? నిరుటిలాగా? ఓ! అయ్యో నాకు జ్ఞాపకమేలేదు. ఓహ్ డియర్, డియర్! (భర్తను కౌగలించుకొనడానికి పోతూ) రంగన్నగారూ, కొంచెం కళ్ళుమూసుకోండి. నాకు చాల సంతోషం—(రంగన్న గోడవైపు తిరుగగా రత్నం ముద్దుపెట్టుకోబోతుంది.)

సింగ్ : (తలుపుఅవతల) హైరో !

రత్నం : (తన్ను 'హైరో' అన్నాడో అనేట్టు తటాల్న నిలబడి) ఆ ! (తలుపువైపు చూస్తుంది.)

సింగ్ : (తలుపుఅవతల) హైరో...నై జాసక్తీ అందర్... క్యాహోనా ఆప్కా ?

పార్వతి : విడవోయ్ దారి, బృహన్నలధుడా ! (లోపలికి తోసుకొనిపోయి, అవతలివైపుచూచి) ఏమిటిరా అన్నది నీవు, పుండాఖోర్? ఎవర్నిరా "ఆప్కా"నేది? (లోపలి వైపు తిరిగి) చూడడం డీ అన్యాయం. వాడు...(తలుపు వెలుపలవైపు చూచి) జాగ్రతరా. ఎవరనుకున్నావు? (లోపలికివచ్చి విక్రమ్‌తో) నమస్కారం. మీరే అయి ఉంటారు మేనేజరు. మీమీసాలుచూసి చెబుతున్నాను. వెనకటికి ఒకసారి సర్కసులో చూచాను. (రత్నంను చూచి) ఓహో హో హో! అదీ ఉందే! లంగాకట్టుకొని, గొడుగుపట్టుకుని తీగమీద నడిచింది—

రత్నం : ఆఁ !

పార్వతి : (రంగన్ననుచూచి) ఓహో హో హో హో !

వారూ ఉన్నారే; కాయితాలటోపీ పెట్టుకుని, తమాషా చేసేవారు ! అయితే, వీరంతా ఇక్కడ యెందుకున్నారో...చూడండయ్యా...మీరు...

విక్రమ్ : ఔనమ్మా, మీరు—

పార్వతి : మావారు. ఆయన పేరు, ఊర్మిళభర్త వేసుకు రావు గారని చెప్పుకోండి. వారిని పాపం, ఉన్నదున్నట్టుగా పనినుంచి తీసివేశారట. ఇలాటి అన్యాయం ఉందా? పోనీ, పనిచేసిన రోజులకన్నా జీతం ఇవ్వొద్దాండీ... ఇదిగోనండి, అర్జీ తెచ్చాను. బీదవాళ్ళం మేము. కనికరించండి.

విక్రమ్ : (అర్జీ తీసుకుంటూ) మేము యెవర్నీ పనినుంచి తీసివేయలేదే—

రత్నం : సరి, మీ అర్జీ చూడండి. (రంగన్న వైపు వెళ్తూ) ఈసారి ట్రిప్ అంత షార్ట్ అయినప్పటికీ యెంత స్వీట్‌గా వున్నదనుకున్నారు ?

రంగన్న : చూడండి, మీరు...

రత్నం : ఇలా వినండి చెబుతాను. రైలు కదిలింది.

విక్రమ్ : ఈ అర్జీ—(అర్థంకాదు)

పార్వతి : ఔనండీ అర్జీ......

రత్నం : యెవరెవరున్నారు బండీలో అని ఒకసారికూడా చూస్కోలేదు. కిటికీదగ్గర కూచున్నాను. "ఊరువిడిచిన మారి" నవల తీసుకువెళ్ళాను వెంట. చదివాను, చదివాను, చదివాను. సాయంకాలం చీకటైె, దీపం ముట్టించే

విక్రమ్ : కాదు, ఇదేమిటి? మీరు...? (అర్థంకాదు)
పార్వతి : ఔను, నేనే.
రత్నం : అప్పుడు యెవరెవరున్నారు బండిలో అని తిరిగి చూచాను. నే నొక్కతెనే ఆడదాన్ని. ఎనిమిదిమంది మగవాళ్లు. పదహారుకళ్లూ నన్ను చురచురచూస్తున్నాయి. ఒకడు టపీమని కిటికీఅవతలికి తలపెట్టి "సుందరనారీ" అని పాటపాడడం ప్రారంభించాడు. ఇంకొకరు హరికథల దాసుగారు కావచ్చు—పళ్లే లేవు—నన్నుచూస్తూ ఆవు లాగ నెమరు నేస్తూ, తువాలుతో చొల్లు తుడుచుకుంటూ ఉన్నారు. మరొకరు శెట్టిగారు—సాపుకారు. ఎడమచేతికి బంగారుముదుగుపెట్టుకున్నారు; ధోవతిచెంగుతో దానికి పాలిష్ ప్రారంభించారు. ఒకడు కాలేజీకుర్రాడులా ఉన్నాడు. ధైర్యంచేసి, ఏమని అడిగాడనుకున్నారు?
విక్రమ్ : ఈ అర్జీ...ఇట్ ఈజ్...ఇట్-ఈజ్...
పార్వతి : ఔను.
రత్నం : "మీరు స్నేహప్రభాదేవేనా, క్షమించండి" అని అడిగేశాడు. నేను స్నేహప్రభలాగున్నానా చూడడానికి.
విక్రమ్ : (అర్జీని చూస్తూ) నాన్‌సెన్స్!
రత్నం : (తన ప్రశ్నకే సమాధానమిచ్చాడనుకొని) ఆ, డార్లింగ్!
విక్రమ్ : ఓ...నీవుకాదు...యు ఆర్ ఆల్ రైట్. (పార్వతమ్మను చూచి) ఇదిగో చూడండి, మీరు...
పార్వతి : నా పేరు పార్వతమ్మ.
విక్రమ్ : మంచిది, పార్వతమ్మగారూ.....

పార్వతి : మా పుట్టింట్లో 'గౌరి' అని పేరుపెట్టారు.
విక్రమ్ : సంతోషం గౌరమ్మగారూ !
పార్వతి : మా తాతమాత్రం "అమ్మయ్యా" అని పిలిచే వారు.
రంగన్న : (రెచ్చిపోయి) మీ అమ్మమ్మ? మీ అమ్మమ్మ ఏమని పిలిచేవారు ?
పార్వతి : అయ్యయ్యో ! మీ రెందుకండీ ఇలా కేకలు వేస్తారు ? నాకేమీ చెవుడులేదు. (విక్రమ్‌వైపు తిరిగి) మాఇంట్లో ఎలాపిలిస్తే వారికేమండీ ? అవును. వాళ్ళు ఇలా పిలిచేవాళ్ళు: అప్పుడూ ఇలాగే ఒళ్లూ, జబ్బలూ, నిండుగా బొద్దుగా ఉండేదాన్ని. అందుకని "గున్నా!" అని పిలిచేవాళ్ళు. వారికెందుకండీ అదంతా ?
విక్రమ్ : క్షమించండి. నాకూ అక్కర్లేదు. ఈ అర్జీకి తలా తోకా ఏమీ అర్థంకావటంలేదు.
రత్నం : అయ్యో ! అలాఅయితే నాకథ వినండి. చక్కగా అర్థమవుతుంది.
విక్రమ్ : కాదూ, రత్నా...నువ్వూ...
రత్నం : నిజంగానే ఎంత స్వారస్యం ఉన్నదనుకున్నారు !
విక్రమ్ : నిదానంగా, సావకాశంగా...
రత్నం : ఔనౌను, నాకు తెలుసు. నాకుమాత్రం తీరిక యెక్కడుంది ? త్వరగా ఇంటికి వెళ్ళి, బాత్ తీసుకొని, బట్టలు మార్చుకుని, ఫోటో వేళకు సిద్ధంకావాలి కదా !
విక్రమ్ : (ముందుకుతోస్తూ) హుఁ...అదే మరి నేనూ చెబుతూంది—బయలుదేరు మరి.

రత్నం : ఎందుకు డార్లింగ్ ! నేను రావడం మీకు సంతోషంగా ఉన్నట్టు కనిపించదు.

విక్రమ్ : ఛి ఛి ! (అతిప్రయాసతో లేని నవ్వు తెచ్చుకుని) నువ్వు...హా హా హా హా—రావడం—హా హా హా హా నాకు-హా హా హా హా ! నిజంగా చాలసంతోషం — హా హా హా హా !

రత్నం: మరి త్వరగా చెప్పి వెళ్ళిపోతాను...రాత్రి ఎనిమిది గంటలప్పొద్దుకు మావూరు చేరాము...ఎవరెవరు వచ్చారనుకున్నారు స్టేషనుకు ?

రంగన్న : అమలుదారుగారు, డిప్యూటీకలెక్టరు, డీసీ.

రత్నం : ఊహూంహూం. వారందరూ ఎందుకు వస్తారండీ నేను వెళితే ? (విక్రమ్‌తో) నా ఏడుగురు ఆప్తస్నేహితురాండ్రూ—పద్మ, ప్రభా, కమలా, శ్యామలా, రాజూ, విజయా, అలమేలూ, అన్నపూర్ణా—అందరూవచ్చారు. కారు వచ్చింది. అంతమందీ చేరి, కారుతోనుకుంటూ ఇల్లుచేరాము.

విక్రమ్ : ఆ !

రత్నం : పొద్దు వృధాచేయరాదు, డార్లింగ్ ! "మధ్యస టైరు పగిలిపోయింది, అందుకోసం," అని చెప్పలేదు. గేటుదగ్గర రాజూ ఏంచేసిందీ—!

రంగన్న : ఓ...సార్...నావల్లకాదండీ...మీప్రసంగంలో అంతా మీ సహధర్మచారిణి, స్నేహితురాండ్రు అల్లరి చేస్తున్నారు.

విక్రమ్ : రత్నా, చూశావా ? నువ్వు వేగిరం ఇంటికి

సడు. ఈదినం ఒట్టి వార్షికోత్సవంకాదు...మన బ్యాంకు భాగ్యం. అఖిలభారత ఆర్థికసమితి ప్రతినిధివర్గం వస్తూంది. మంచి శుభసమయం. అన్నీ సిద్ధంచేయాలి. నువ్వు బయలుదేరు.

రత్నం : అలాఅయితే ఆకుపచ్చ జార్జెట్ కట్టి, రెండుజడలు అల్లుకుని – ఉహూం హూం – చెప్పను...మీరే చూతురు గాని – డంగైపోవాలి ప్రతినిధివర్గం! త్వరగా ముగించండి అయితే. బై–బై...టా–టా... (బ్యాంకులోపలికి వెళ్లుతుంది.)

విక్రమ్ : మైగాడ్ !...రంగన్నగారూ...చూచారా, ఎలా పంపించివేశానో ! ఎవర్నను—విక్రమ్! (అని మీసాలు దువ్వుకొనేలోపుగా)

పార్వతి : మ్యానేజరుగారూ ?

విక్రమ్ : (అదిరిపడి) ఆ! ఓ! మీరింకా–ఇక్కడే ఉన్నారా? నే నప్పుడే చెప్పానుకదా, నాకు మీ అర్జీ ఏమీ అర్థం కాలేదని.

పార్వతి : అదెందుకు అర్థంకాదు లెండి ! నా మొదటిఅల్లుడు వ్రాసింది.

విక్రమ్ : అయినంతమాత్రాన...

పార్వతి : సుబ్బమ్మా...

విక్రమ్ : సరే—

పార్వతి : మా మహాలక్ష్మి మొగుడు...

విక్రమ్ : (విసుగ్గా) తుస్స తుస్స తుస్స...

పార్వతి : కోటప్పసత్రంలో పెండ్లికావడం...ఇద్దరు నాగ

పిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. అదెందుకు అర్థంకాదు ?

విక్రమ్ : మీకు – మీకు ఎందుకు అర్థంకావడంలేదూ అని నేను అడుగుతున్నా ! (వెలుపల రత్నం "హాల్లగుల్ల" పాడగా) ఓహ్ గాడ్ !

రంగన్న : "ధరణీమండల మధ్యమందు," నాకూ రెచ్చిపోతుంది సార్ ఇక.

పార్వతి : రెచ్చిపోతే ఉన్నదికాస్తా మరచిపోతారు. మొరయు కన్నడదేశమందలి—"

విక్రమ్ : ఓహ్ ! ఓహ్ !... మీకు నమస్కారంచేస్తాను. దయచేసి త్వరగా వెళ్ళిపోండి – నాకు పిచ్చిపట్టడానికి ముందే.

పార్వతి : నా అర్జీ ?

విక్రమ్ : మీ అర్జీ మాకుకాదు ఇవ్వవలసింది...

పార్వతి : (పిచ్చిపిచ్చిగా నవ్వుతూ) హుఁ... హుఁ... నన్ను పిచ్చిదానికిందకట్టేశారు మీరంతా... నేను దీన్ని నాలుగయిదుచోట్ల చూపాను; అందరూ మీలాగే చెప్పారు; "మాదికాదు మాదికాదు" అని. మీరూగా ఇక్కడ ఆ రాగమే పాడుతున్నారు. నాకు తెలిసిందిప్పుడు మీ ఆట. ఇది మీకే – ఇది మీకే అర్జీ... మీకు తెలీదు.

విక్రమ్ : కాదమ్మా, మీ యజమానులు...

పార్వతి : ఊర్మిళ ఊర్మిళ ఊర్మిళ భర్తపేరుకి రాపుగాగాసి చేర్చండి.

విక్రమ్ : ఓ ఓ ఓ... (మాట్లాడడానికి ఆమెకు అవకాశ

మిన్వకుండా) చేర్చాను. లక్ష్మణరావుగారు. వారు పని చేసేది రైల్వేగుడ్స్ షెడ్‌లో...సర్కారీ ఆఫీసు అది... అక్కడికి వెళ్ళాలి మీరు ... (మాటలువిడదీసి స్పష్టంగా) ఇది – లక్ష్మీబ్యాంకి లిమిటెడ్; ప్రైవేటు వ్యక్తులది. అర్థమైందా ?

పార్వతి : సా...రి. నాకూ ఆమాత్రం అర్థంకాదా ? బి.ఎ. ప్యాసుకాకపోయినా, బుద్ధిఉందిగా ? ఇంతకుముందు పద్యంచెప్పానుకదా! పోనీ, వారు అక్కడ పనిచేశారు, మీరు ఇక్కడ జీతం యిచ్చేయండి. నేను అంతదూరం పోలేను.

విక్రమ్ : ఆ ! అయ్యో, మీ మాటలకు నేను బదులు చెప్పలేనమ్మా! మే మెలా ఇస్తామమ్మా జీతం ?

పార్వతి : ఏం? డబ్బు ఉందిగా కావలసినంత. అక్కడ— వస్తూ చూశాను.

విక్రమ్ : ఎక్కడ ఉందమ్మా...అయ్యయ్యో...ఎవరిడబ్బు అది? ఎవరికి ఇవ్వడం ? ఎలా ఇవ్వడమమ్మా ?

పార్వతి : అదంతా నాకేం తెలియదు. త్వరగా...ఆలస్యం చేయకండి. పైగా వారికి జబ్బు. పాపం ! మంచం పట్టారు. చూడండి డాక్టర్ చీటీ ఉన్నది.

విక్రమ్ : వారికి జబ్బుగాఉండవచ్చు ... అయితే అది మాకు సంబంధించిందికాదని గాదండీ నే చెపుతోంది ?

పార్వతి : ఔనులెండి! జబ్బువచ్చింది వారికి. మీకు ఎలా సంబంధిస్తుంది ?

విక్రమ్ : ఓ ఓ...నాకు...నాకు... (తప్పించుకొనడానికి

బ్యాంకివైపు బయలుదేరుతాడు)

రత్నం : (లోపలికి తోసుకునివస్తూ) ఇంకొక ముఖ్యమైన విషయం మర్చిపోయాను, డార్లింగ్ !

విక్రమ్ : ఓ...రత్నా !

రత్నం : విశాలి కిట్టూను పెళ్ళిచేసుకోవాలని అనుకుం దట. (అక్కడి సంగతిసందర్భాలు చూసి) ఓహో... ఇంకా ముగియ లేదూ? త్వరగా డిస్ పోజ్ చేసి వేయండి. (ముందుకు రాగా, రంగన్న గాభరాపడగా) భయపడ కండి. నేను మిమ్మల్ని డిస్టర్బ్ చేయను ... ఇక్కడ కూర్చునిఉంటాను.

[విక్రమ్ కుర్చీలో కూచుంటాడు.]

పార్వతి : ఇదేమిటి ? ఈ ఆడపిల్ల మాటమాటకీ లోపలికి వచ్చి మీ పనినంతా పాడుచేస్తుందేమిటి ?

విక్రమ్ : ఆమె అలాగే...మీరున్నారని సరదాగా తోసుకు వచ్చిఉంటుంది ... మీరు దయచేసి దయచేయండి; ఆమే వెళ్ళిపోతుంది.

పార్వతి : వారికి ఒకమాట చెప్పండి మరి. ఏభైమూడూ చిల్లర రావాలి. లేదంటే పోనీ సగం ఇమ్మనండి... ముందునెల సర్దుకొని తక్కినసగం ఇప్పింతురుగానీ.

విక్రమ్ : చూడండి, మనుష్యుని ఓర్పుఅనేదానికీ ఒక హద్దుఉంది.

పార్వతి : ఉండకుండాఉంటుందా? అదే నేనూ అనడం... ఇంతసేపటినుంచీ నేను అడుగుతూనే ఉన్నాను,మీరు...

విక్రమ్ : ఓ...అబ్బా...కాదండీ, ఇది బ్యాంకు. ఇక్కడ ఇవ్వడానికి వీలులేదు. మీ రిక్కడికి రావడం పళ్ళు తీయించుకోడానికి కాన్పులఆస్పత్రికి వెళ్ళినట్టు... ఇంటికివెళ్ళి మీవారిని అడగండి...ఎక్కడికి వెళ్ళాలో అని...చెబుతారు. అక్కడకి వెళ్ళండి.

పార్వతి : ఊఁ, నేను అడిగాను, వారు చెప్పారు. అయ్యో, మీకు తెలియదండీ. వారు శుద్ధ వెర్రివారు పాపం! నేనే సంసారమంతా ఈదడం. ఏమైనా అడగండి మీరు, "బియ్యబ్బస్తా ఏమైంది?" "నాకు తెలీదు." "రాగుల బస్తా ఏమైంది!" "నాకు తెలీదు" ఇది ఒకేపాట. దయ చేసి మీరే సహాయంచేయాలి.

విక్రమ్ : నేనేం చేయను?

పార్వతి : మరి నా గోడు ఎవరు వింటారు?

విక్రమ్ : నాగోడు? నా గోడు? రంగన్నగారూ!

రంగన్న : నాగోడు. నాగోడు. అప్పటినుంచి అరపేజీ ముందుకు సాగలేదు.

విక్రమ్ : తల గిర్రుమని తిరుగుతూంది. కళ్ళు చీకట్లు కమ్ముతూఉన్నాయి.

రత్నం : (గాబరాపడి పరిగెత్తివచ్చి) డార్లింగ్! అలాగే కూర్చోండి...కర్చీఫ్ కడతాను గట్టిగా.

పార్వతి : తుస్సు తుస్సు తుస్సు తుస్సు ...వదులు. అదేం ప్రయోజనంలేదు. నా మందు విను. నాగజెముడుఆకు అని ఉంటుంది. (ముందు చెప్పినదంతా అభినయిస్తూ) దాన్ని అంత, రవ్వంత తెంపుకొనివచ్చి, ఇలా అరచేతిలో

పెట్టుకుని, ఈ చేత్తో ఇలా బాగా నలిపి, రసం—చూడు ఇలా ఇక్కడ ఇక్కడ (అంటూ రత్నం కళ్ళకూ, చెంప లకూ పుద్దుతూ) పదినిమిషాలు రుద్దితే—

రత్నం : అయ్యో, వదలండి...

విక్రమ్ : రంగన్నగారూ, నావల్ల సాధ్యంకాదు. మీరైనా దయచేసి చెప్పండి. (దూరంగాఉన్న సోఫాలో కూర్చుం టాడు.)

రంగన్న : (లేచివచ్చి ముక్కుమీద కళ్ళజోడులోంచి చూస్తూ) ఏమిటి ? ఏమి కావాలి మీకు ?

పార్వతి : అహఁ – ఆగవయ్యా, నేను చూడటానికి ఇలా ఉన్నా, నిజంగా నాకు ఒంట్లో ఓపికలేదు. రెండుఅడు గులు నడవలేను. నాలుక మొద్దుబారిపోయింది. నిన్న రాత్రి గంజిచేసుకున్నాను. పక్కింటిపారిజాతపు చెట్టు భాగీరథమ్మ మామిడికాయ ఊరగాయ ఇచ్చారు. ఊహూ. నాలుకకు ఉప్పూ, ఖారం అంటనేలేదు. తెల్ల వారుఝానే మూడుసార్లు కాఫీ కాచాను. తాగినట్టేలేదు నోటికి. చూడండి నాలుక... (నాలుకచాచింది.)

రంగన్న : ఓ...సర్కార్ ! వీరి నాలుకనైనా కోసివేయ కూడదా ?...పార్వతమ్మా, కాళికాదేవి ! మీ నాలు కను లోపలికి ఉపసంహరించుకొని మీకు ఏమికావాలో చెప్పండమ్మా.

పార్వతి : డబ్బు.

రంగన్న: ఏమిడబ్బు ?

పార్వతి: మావారికి ఇవ్వవలసినడబ్బు. వారికిజ్వరంతగిలింది.

రంగన్న : సరే...
పార్వతి : ఇదిగో డాక్టర్ వ్రాసిఇచ్చారు.
రంగన్న : మీకు మెడమీద తల...
పార్వతి : చాలకపోతే పొరుగింటి పోలీసు దఫేదారిగారి దగ్గరనుంచీ వ్రాయించుకొని వస్తాను.
రంగన్న : మీ తల – మీ తలలోపల ఏముందండీ ?
పార్వతి : (నవ్వి) ఎవరికి తెలుసు ? హ హ హ హ... మీకేమి నెర్రా ? తలలోపల ఉన్నది పైకి కన్పిస్తుందిటండీ ! (నవ్వి) నవ్వించకండి నాయనా. నాకు నవ్వడానికూడా శక్తిలేదు.
రంగన్న : ఓహో, నా వల్లకాదు, నావల్లకాదు. తిరిగీ తలనొప్పి... (ఎడమవైపు తలుపునద్దకు వెళ్ళి) క్యాషియర్, సారిడాన్, సారిడాన్!
విక్రమ్ : నాకూ...నాకూ రెండు...రెండు.
పార్వతి : నన్ను పంపించివేయండి మరి...
రంగన్న: ఎవరు మిమ్మల్ని ఇక్కడ కట్టివేసింది. వెళ్ళిపోండి.
పార్వతి : నా డబ్బు ?
రంగన్న: నీ దిబ్బ !
పార్వతి : ఆ ? ఏమిటీ ! నా దిబ్బా ? ఏమయ్యా ఈ అన్యాయం ? 'దిబ్బ' అంటావు ముత్తైదును ? మీరంతా లక్షణానికి నన్నంటారా ? మీ ముఖాలు చూసుకున్నారా అద్దంలో ?
రంగన్న: ఓ ... మహాతల్లి ... బ్రహ్మహత్యా ... స్త్రీహత్యే... (తన కుర్చీనద్దకు వెళ్ళ దానిలో ఒరిగిపోయి,

స్వామీ !...ప్రతినిధివర్గం వచ్చే వేళ...
విక్రమ్ : (లేచి పార్వతిదగ్గిరికి వచ్చి) ఆల్ రైట్ ... ఏమండీ... (జేబునుంచి పర్సుతీసి) యాభై మూడూ చిల్లర అన్నారు కాదూ......
పార్వతి : అనలేదండీ ... సందర్భం అలాఉందీ అని అడుక్కుంటూఉన్నాను. నా రెండవఅల్లుడు, పోలీసు సబిన్స్పెక్టరు. వాణ్ణి అదేమోచేసి జీతంలేకుండా సెల విచ్చారట. వానికీ ఇబ్బందే. వాడిపనిగతి—
విక్రమ్: దేవుడా...దేవుడా...గతి. ఇప్పుడు మీరు పట్టండి. అరవైగూపాయలున్నాయి...తీసుకుని దయచేయండి.
పార్వతి : (నవ్వి) ఇంతపని మొదట్లోనే చేసిఉంటే, ఎంత చక్కగా ఉండేది! ఫరవాలేదు. వస్తాను. జ్ఞాపకం ఉంచుకోండి.

[రంగన్నవైపు తిరిగి]

అలా అంతా అనరాదు, మీరు పెద్దలు. జ్ఞాపకం ఉంచుకోండి.

[రత్నంవైపు తిరిగి]

నీవూ అంతేనమ్మా అమ్మాయి. ఇలా ఆఫీసులోకి వచ్చి గోలచేయకూడదు. వస్తాను, జ్ఞాపకం ఉంచుకో. (వెళ్ళిపోతుంది.)
విక్రమ్ : అ...బ్బ... (పెద్దగా నిట్టూర్చి, కుర్చీలో కుక్కినట్టు కూర్చుంటాడు.)
రత్నం : (సద్దుచేయకుండా పక్కకువచ్చి) కిట్టూకు విశాలినే పెళ్ళిచేసుకుందాము అని ఉందిట !

విక్రమ్ : (అదరిపడి) ఆ !
రత్నం : ఎందుకు డార్లింగ్, భయమైందా ? నేను యువర్ ఓన్ వైఫ్‌ను...ఇది వినండి. అయితే, ఈ పెళ్ళి అమ్మకు ఇష్టంలేదు. నాన్నకూ ఇష్టంలేదు. అన్నకూ ఇష్టంలేదు. కిట్టు పా—పం, "అందరూ వద్దు" అని అన్నారు కదా అని...ఏంచేశాడు అనుకున్నారు డార్లింగ్!నాకే ఇప్పుడు గుండె అదరిపోతూంది చెప్పడానికి. అబ్బబ్బ ! ఏం చేశాడు అనుకున్నారు డార్లింగ్ !
రంగన్న: "లేతమామిడిచెట్టుకింద..."
రత్నం : మీరు ఊరుకోండి ... తమాషాసంగతికాదు ఇది. ఏంచేశాడో తెలుసా వాడు ?
రంగన్న : "ఎగిరెనూ హనుమన్న లంకకు..."
రత్నం : ఓ...డార్లింగ్... డార్లింగ్...వారు నన్ను అవమానంచేస్తున్నారు. ఏంచేశాడో తెలుసా ? లంకకు కాదు ఎగిరింది...భావిలోకి, డార్లింగ్! కొత్తభావి ...అందరూ చేరి బయటికి తీశారు. తడిసి ముద్దై పోయాడు. ... డాక్టర్ను పిలిపించి, ఇంజక్షన్‌ఇప్పించారు. ఇంకా పూర్తిగా చావలేదు. అయినా విశాలి ఏడ్చింది. నేనూ ఏడ్చాను. అమ్మా ఏడ్చింది. నాన్నా ఏడ్చారు. అన్నా ఏడ్చారు.
విక్రమ్ : రత్నా, రత్నా ... నేనూ ఏడుస్తాను ... నేనూ ఏడుస్తాను......
పార్వతి : (మళ్ళీ లోపలికి తోసుకువస్తూ) మేనేజర్, మా రెండోఅల్లుడికి మీ బ్యాంకులో ఏదైనా పనిఇప్పిస్తారా?

విక్రమ్ : (సహించలేక లేచి ఈవైపే నిడుగక నెను దూరంలో ఉన్న సోఫాలో పోయి పడుతూ) రంగన్న గారూ ... నేనే రాజీనామా ఇచ్చేస్తాను, ఆయన్ని వచ్చి చేసుకోమని చెప్పండి. నావల్ల కాదు... నా తల కాయ...నా తలకాయ... (అనుకుంటాడు.)

రంగన్న: సింగ్ ! సింగ్ !

సింగ్ : (ప్రవేశించి) సాబ్ !

రంగన్న: లాక్కునిపో ఆమెను అవతలికి.

[రత్నం, పార్వతి పక్కనపక్కనే ఉంటారు]

సింగ్ : (రత్నాన్ని చూచి) జా బాహర్.

రత్నం: అయ్యో డార్లింగ్ !

విక్రమ్: (పార్వతికోసం వేడుకుంది అనుకొని) ఊహుహూ. తన్ని లాక్కునిపో దాన్ని అవతలికి.

సింగ్ : నికల్ జా !

రత్నం : అయ్యో, డార్లింగ్ ! డార్లింగ్ !

[రంగన్న, విక్రమ్ ఇద్దరూ సింగ్ రత్నంభుజంపై చేయి వేయడం చూచి]

విక్రమ్ : ఫూల్ ! మంకీ ! డాంకీ ! అది అది...

రంగన్న: మూర్ఖుడా ? కోతీ ! గాడిదా ! ఆవిడ ఆవిడ దొరగారి అమ్మగారురా, ఆవిడను తోస్తావా ?

విక్రమ్ : మూర్ఖుడా ! కోతీ ! గాడిదా ! విడూ దాన్ని !

రంగన్న: ఫూల్! మంకీ! డాంకీ! విడూ ఆవిడను.

విక్రమ్ : నా భార్యను భుజంపట్టుకొని తోస్తావా ?

రంగన్న: (పార్వతిని చూపుతూ) దాన్నిరా...దాన్నిరా...

ఆ పీడను తన్ని తరిమెయ్.

సింగ్ : అచ్ఛా సాబ్... (పార్వతమ్మవైపు వెళ్ళి) చలో యహాఁసే...

[అంతలో పత్నం పరిగెత్తి భర్త ప్రక్కన చేరి, కౌగలించుకొని తల రొమ్ముపై ఆనించి "డార్లింగ్, డార్లింగ్ - అంటుండగా]

పార్వతి: గడ్డంలాగి పడేస్తాను, దూరంగా నిలబడరా, సైంధవుడా! మేము బ్రాహ్మలం. (రంగన్నవైపు వస్తూ) ఎవర్నండీ మీరు పీడ అన్నది?

రంగన్న : (ఆమెవచ్చేధాటికి బెదిరిపోయి నిలబడి) ఆఁ!

పార్వతి : (బల్లదగ్గరికివచ్చి) ఎవర్నండీ మీరు తన్ని సాగనంపనున్నది? (బల్లమీంది రూళ్ళకర్ర తీసుకుని)

రంగన్న : అయ్యయ్యో...ఛీఛీ......(తప్పించుకోనడానికి ప్రయత్నిస్తాడు.)

పార్వతి : అమ్మమ్మ...ఛీఛీ...ఏమని అనుకున్నారండీ నన్ను మీరు?

రంగన్న : (పరిగెత్తుతూ) సార్...అరెరె...మీరు...

పార్వతి : (వెంటబడి) ఇంట్లోనూ మీ పెళ్ళాన్ని ఇలాగే భయపెడుతూఉంటారో ఏమో, పాపం...

రంగన్న : ఓ...అరె...మీరు...

పార్వతి : చెప్పుతా పాతం...ఇంత వయస్సుమళ్ళినా మగవాడు...

రంగన్న : (రూళ్ళకర్రను చూచి) అయ్యయ్యో, ఏమిటి గతి? (పెద్ద లెడ్జర్ ఒకటి పైకెత్తి) నేను వ్రాసిన లెక్కలే నన్ను కాపాడాలి. (తలపై పెట్టుకుంటాడు)

పార్వతి : (లెడ్జర్ మీంద ఒక్కదెబ్బ కొట్టి) పుస్తకం అడ్డం

పెట్టుకుంటారా ? (మళ్ళీ రూళ్ళకర్ర ఎత్తగా)

గుమాస్తా : (ప్రవేశించి) సార్, అఖిలభారత ఆర్థికసమితి ప్రతినిధివర్గం !

విక్రమ్ : ఆ, రంగన్నగారూ !

రంగన్న : సార్ !

[ నిస్సహాయుడైన విక్రమ్‌రొమ్ముపై రత్నం తల ఆనించి వుంటుంది. రంగన్న దెబ్బలుపడతాయని భయపడి లెడ్జరును వీరభద్ర పళ్లెంలాగా తలపైన పట్టుకునివుంటాడు. పార్వతి రూళ్ళకర్రను త్రిశంకు స్వర్గంలాగ మధ్యనే నిలిపి, తలుపువైపు చూస్తుంది. సింగ్ అందరినీ చూస్తూ నిలబడుతాడు. ప్రతినిధివర్గం ప్రవేశించి లోపల జరుగుతున్న దానినేమీ చూడరు. ]

ప్రతినిధివర్గ నాయకుడు : (వ్రాసుకొనివచ్చిన ఒక సమ్మాన పత్రం చదువుతూపోతాడు)

మాన్యశ్రీ విక్రమ్‌గారూ !

అంటే దక్షిణభారతంలో భాగమైన మైసూరు రాష్ట్రం ముఖ్యనగరమైన బెంగుళూరు లక్ష్మీబ్యాంక్ లిమిటెడ్, మీరు అధికారసూత్రం వహించడానికిముందు "తాళం వేద్దామా, తెరిచే ఉంచుదామా"...అన్న ఆందోళనలో కొట్టుమిట్టాడుతూ... (లోపలిదృశ్యం చూచి) ఓ ఆంమ్ం...ఉహుమ్ "బ్యాంకు గౌరవం"...

రత్నం : డార్లింగ్...డార్లింగ్...!

ప్రతినిధివర్గ నాయకుడు : ఓ...ఓ... (సాధ్యంకాదన్నట్టు) క్షమించండి...మీరు చాల బిజీగా......మేము మళ్ళీ వస్తాము, క్షమించండి.

[ప్రతినిధివర్గం వెళ్ళిపోతూఉండగా తెర పడుతుంది.]

# చెప్పుడుమాటలు

## 'ఎన్కె'

'ఎన్‌కె' - ఎన్. కె. కులకర్ణి గారు పెక్కు నాటకాలు రచించారు.

'నడుమనెయల్లి' (నట్టింట్లో), కావ్యద కారఖానె' (కావ్యాలకార్ఖానా), 'బుష్‌కోట్' అనేవి వారి ఏకాంకనాటికల సంకలనాలు. 'ఎన్కె'గారి నాటకాలలో 'శ్రీరంగ'గారి ప్రభావం చూడవచ్చు. అయినా 'ఎన్కె' గారి మార్గం, దృష్టి 'శ్రీరంగ'గారి మార్గం దృష్టులకన్నా భిన్నమైనవి. అవి చాల తేలికగా వుంటాయి. నవ్వునురగలను రేపు తాయి.

బాల్యంలో రామలక్ష్మణులలాగ పెరిగిన శ్రీపాద శ్రీధరులను కౌరవ పాండవుల కురుక్షేత్రానికి లాగినవి - "చెప్పుడు మాటలు."

# పాత్రలు

| | | |
|---|---|---|
| శ్రీపాదరావు | ... | ఇంటి యజమాని |
| శ్రీధరరావు | ... | అతని తమ్ముడు |
| రుక్మిణీబాయి | ... | శ్రీపాదరావు భార్య |
| లక్ష్మంబాయి | ... | శ్రీధరరావు భార్య |
| యాయవారపు జీవవ్వ | ... | (విధవ) |

# చెప్పుడుమాటలు

[ స్థలం శ్రీపాదరావు శ్రీధరరావుల ఇల్లు. ఇద్దరూ వేరుపడలేదు గనుక. నడవలో లక్ష్మంబాయి లాంతరులో నూనెపోస్తూ కూర్చున్నది. ఇంతలో ఉపాదానంచెంబు పట్టుకొని జీవవ్వ ప్రవేశిస్తుంది. ]

జీవవ్వ : (తలవాకిలిగుమ్మందగ్గరనిలబడి) ఏమమ్మా, ఏమిటి సంగతులు ?

లక్ష్మంబాయి : (తలవంచి లాంతరువత్తి కత్తిరిస్తూ) హూఁ రాండి, మరేంవుంటుంది. ఏదో పని.

జీవవ్వ : అయ్యో! ఇదేంపనే లక్ష్మంబాయి? తెల్లవారి లేచీ లేవగానే దీపాల్లో నూనెపోయడం ప్రారంభించావేమిటి?

లక్ష్మంబాయి : హూఁ. మరి ఈ వేళనించీ పగటిపనంతా ఆమె చూచుకుంటుందంట. పోనీ అలాగే కానీ అని, నావంతుపని ఇప్పుడే చేసేసుకుంటున్నాను.

జీవవ్వ : అలాఅయితే రుక్మిణీబాయిగారు స్నానంచేస్తున్నారా?

లక్ష్మంబాయి : హూఁ, చేసేవుంటారు. ఎంతైనా పెద్దవారు కదూ! పెద్దవారికి పైపనులు ఎక్కుడుంటాయి చెప్పండి.

జీవవ్వ : అంటే పగటి పైపనులూ నీవే అనరాదూ?... ఏంచేసేదమ్మా. సమయాన్నికనిపెట్టి నడుచుకోవాలి కదా చిన్నవాళ్ళు! అయినా పాపం! నువ్వు గోవులాంటి దానివి గనుక సరిపోతుంది. (వెలుపల రెండుకుక్కలు

అరుస్తున్నాయి.) అయ్యయ్యో! ఎలా పెంచుతున్నారే మాయమ్మ వీటిని?

లక్ష్మింబాయి : కుక్కలన్నతర్వాత పెంచడంకూడా ఎందుకూ! తిండివాసన తగలగానే తోకలల్లాడిస్తూ అవే వస్తాయి.

జీవవ్వ : ఛీ! పాడుకుక్కలు. మడీ మైలా అనేదే సాగదే... మాయమ్మా! ఇలాటి కుక్కలకాలంలో.

లక్ష్మింబాయి : జీవవ్వా, నా జన్మ కుక్కజన్మ అయిందవ్వా. సాకినకుక్క అయితే పిలిచి అన్నంపెడతారు. నాది ఊరకుక్క బతుకయింది. (కన్నీళ్ళు తుడుచుకొని, మళ్ళీ దీపానికి నూనెపోస్తూ వుంటుంది.)

జీవవ్వ : హూఁహూఁ, ఊరుకో లక్ష్మింబాయి ... (తనూ కన్నీళ్ళు కుక్కుకుంటూ) మీ అత్త మహాతల్లి! సముద్రంలాగ వుండేది. అత్తఅంటె అత్తా! చిన్నకోడలిపైన ప్రాణం. అయితే, ఏంజేస్తాంలే. నీకా అదృష్టంలేదు. లేకపోతే ఈ అత్తలేనియిల్లే దొరకాలా పాపం నీకు?

లక్ష్మింబాయి : అదీ నా దురదృష్టమేట అవ్వా. నేనువచ్చి మా అత్తను పంపించివేశానట. నేను కాలుపెట్టగానే ఆమె పోయిందని అందరూ యింకా నన్నే ఆడిపోస్తున్నారు.

జీవవ్వ: ఆయుర్దాయంతీరి ఆవిడచస్తే, పాపం నువ్వేంజేస్తావు? ఎవరైనా ఏంజేస్తారు? ఆడిపోసుకొనేవారి చేతిలోవనా అది?

లక్ష్మంబాయి : ఇంతకీ నేను మాటపడవలసిన రాత ఉందవ్వా. దానికి ఎవరేంచేస్తారు ?

జీవవ్వ : చూడు లక్ష్మంబాయి! నేను ఒక్కమాట చెప్తాను వినూ. ఎవరు ఏంచెప్పినా నువ్వు మనస్సుకు పట్టించుకోవద్దు. ముఖ్యం ఏమిటమ్మా అంటే ఆవువంటి మొగుడు దొరికాడు. ఆయనకు నువ్వంటే ప్రేమ వుందో లేదో, అది చూసుకో... చాలు.

లక్ష్మంబాయి : ప్రేమగానే వుంటారు, పెండ్లి చేసుకొన్న తప్పుకు. అయితే, ఎంత అన్నా పెండ్లాంకన్నా అన్నల మీాద, అన్నల పిల్లలమీాద కదా మమత! ఔను మరి. మేమేమిటి, నాలుగురోజులయింది గడపదాటి లోపలికి వచ్చి. వాళ్ళు ఒక్క కంచంలో తిని పెరిగినవాళ్ళు మరి!

జీవవ్వ : ఇప్పుడు మీారు ఒక్కకంచంలో తినడంలేదూ. ఆ మాట వదిలేయి. నాకు చెప్పకు ఆ మాట...

లక్ష్మంబాయి : అయ్యయ్యో! మొన్న ఉగాదిపండగనాడు అన్నకొడుక్కి బంగారుమొలతాడు చేయించిపెట్టారు. మనమ్మల్ని మాత్రం చింకి మడిచీరతోనే కాలం గడపమంటారు.

జీవవ్వ : చూడూ, రేపు మీాకు పిల్లలుపుడితే ఆయన అన్నగారిని చేయిస్తారు. మరి దాయాదులు అన్నప్పుడు ఉండేదే నమ్మా ఇదంతా.

లక్ష్మంబాయి : హాయ్యో! మీా కేమి తెలుసు జీవవ్వా. రోజుకి ఏ అయిదునిమిషాలు కనిపిస్తారో! మా యింటి సంగతి అంటే అదంతా పెద్ద రామాయణం అనుకో!

జీవవ్వ : ఔనమ్మా. నేనూ విన్నాను. పాపం తప్పులేకపో యినా తప్పులు మోపుతుందటగా నీ కోడికోడలు నీమీాద.

లక్ష్మీంబాయి : హూఁ. గోరంతలు కొండంతలుచేస్తే ఎవరి కయినా తప్పు కనిపిస్తుంది...పెద్దవాళ్ళమాటే ముందుకు వస్తుంది... నా మాట ఎవరికి నిజమనిపిస్తుంది చెప్పండి? ముఖ్యంగా చేసుకొన్నవారే మనది తప్పు అంటూంటే. (చేత్తోనే చెత్త ఊడవడం ప్రారంభిస్తుంది.)

జీవవ్వ : (ఆమె చేతులు పట్టుకుని చూసి) అయ్యయ్యో! నీ చేతులకుపుండే బంగారు మురుగులు ఏమయ్యాయి లక్ష్మీంబాయీ?

లక్ష్మీంబాయి : (చేతులు గుద్దుకుని) అదే నవ్వా అదే! మురుగులు చెరిపించే అన్నకొడుక్కు ఆ మొల తాడు చేయించింది... ఇంకా చూడండి, జీవవ్వా. భార్యప్రాణంకూడా తీసి వాళ్ళకి ఏమైనా చేయించిపెట్ట మంటే కూడా చేయించడానికి తయారుగా వున్నారు. అన్నదమ్ములమధ్య సయోధ్య అవ్వా అది! అన్నా తమ్ముడూ ఏకమై లోకానికి పాఠం నేర్పుతారట సారు... అయ్యో ప్రేమ! అయ్యో కలుపుగోలుతనమా! ముంది గొంతుపిసికిటమ్మా జీవవ్వా, ఆ కలుపుగోలుతనం?... (కన్నీళ్లు)

జీవవ్వ : పెద్దతప్పే చేశాడమ్మా శ్రీధరరావు. కాకపోతే అన్నకొడుకు పుట్టినరోజుఅని పెళ్ళాం ఒంటిమీాది వస్తువులు చెరిపిస్తారా? రుక్మిణీబాయికన్నా వుండొద్దా?

ఈలా నీ మురుగులు చెరిపించి కొడుక్కి మొలతాడు చేయించుకుంటుందా?

లక్ష్మింబాయి : అయ్యో! ఓఓ! బిడ్డ ముద్దుగా వస్తువులు పెట్టుకుంటే చూడాలనే ముచ్చటమ్మా అది... మురుగులు చెరిపించి పిల్లడికి వస్తువులు చేయించండి అని తానే కుచ్చికుచ్చి చెప్పినప్పుడు—

జీవవ్వ : అయ్యయ్యో! మొత్తంమీద రుక్మిణీబాయి చాల అక్రమంచేసింది. మీంఅత్తవుంటే, ఇలా చేయించిపెట్టేదా లక్ష్మింబాయీ ? (కుక్కలు మళ్ళీ అరుస్తాయి) అయ్యయ్యో! పాడుకుక్కలు ఏమి అరుస్తున్నాయమ్మా!

లక్ష్మింబాయి : మేమూ వాటిలాగే అని వచ్చినవాళ్ళ కంతా చూపడానికే పెంచారు పీళ్ళు ఈ కుక్కల్ని. జీవవ్వా, కరిచేకుక్కలు కావులే!...(లోపల చిన్నపిల్లల ఏడుపు)

జీవవ్వ : అయ్యో! పిల్లవాడు ఎవడో పాపం తెగ ఏడుస్తున్నాడు... ఎందుకు కొడతారమ్మా పాపం పిల్లల్ని!

లక్ష్మింబాయి : పిల్లలమీదికోపం కాదవ్వా అది - పెద్దల పైని ద్వేషం... పాపం పిల్లలేమిచేస్తాయి.

జీవవ్వ : ఇదిటమ్మా కోపంతీర్చుకొనే పద్ధతి! అది ఎవరికి చెరుపు అనే ఆలోచన వుండొద్దా...

[ రుక్మిణీబాయి కేకలువేసుకుంటూ ప్రవేశం ]

రుక్మిణీబాయి : పిల్లలు వట్టిఅన్నం తింటున్నాయి. అన్నంలోకి అన్నంలోకి అని కేకలు వేస్తున్నా ఎవరూ వినేవాయిలేరు. కాలిపోను. నే ఒకతిని స్నానంచేసి కూచు

న్నానూ అంటే, పిల్లలు ఒక్క మెతుకు ముట్టటం లేదు... జీవవ్వా, మీరైనా కాస్త మెంతిపిండీ మజ్జిగ కలిపిపెట్టండవ్వా. రాండమ్మా! కాస్త పుణ్యంకట్టుకోండి. రేపటి నుంచి నేను ఉదయం పిల్లలకు అన్నాలుపెట్టుకునే స్నానంచేస్తాను. మనపిల్లలసంగతి మనం చూసుకోక పోతే, మరెవరు చూస్తారు జీవవ్వా. (లక్ష్మంబాయి మాట్లాడకుండా లేచి, దడదడా వెళ్ళిపోతుంది.) చూచారా, జీవవ్వా! ఆడదాని అక్కసుతనం! ఆడది అనాలా, అడవిలోని పులి అనాలా దీనిని? పైగా, కుక్క జాతి అని పొడిచిపొడిచి మాట్లాడుతుంది, తాను కుక్క లాగ ఒకరియింట్లోవుండి తింటూ.

జీవవ్వ : చిన్నవాళ్ళు అన్నతర్వాత పెద్దవాళ్ళమాట వినాలి కదమ్మా. తప్పౌతుందా?

రుక్మిణీబాయి: అయ్యయ్యో! సరేలే, చేసుకున్నవాళ్ళే చెపుతారటమ్మా! మాట వినవద్దూ అని.

జీవవ్వ : (అదరిపడి) ఆఁ! నిజంగానా? ... ఇలా చేయొచ్చా శ్రీధరరావు? కాదూ, అప్పుడే లక్ష్మంబాయి మొగుణ్ణి గుప్పిట్లోపెట్టుకుందన్నమాట! తనచేతుల మురుగులు అమ్మేసి, మీరేమో పిల్లవాడికి మొలతాడుచేయించారట —

రుక్మిణీబాయి : ఆఁ? చూడండవ్వా! ఎల్లావుందో. నీరు నా దండకడియం చెరిపించి ఈమెచేతులకు మురుగులు చేయించిపెట్టారు పెళ్ళిలో. అది చూడండి ఇప్పుడు ఎలా చెబుతుందో! తనమొగుడు వాటిని అమ్ముకుంటే నా

పిల్లలకు వస్తువులు చేయించిపెట్టాడని చెపుతుందా ఈ బొంకులాడి? నా పిల్లలకు ఎవరూ చేయించలేదు. నేను పుట్టింటినుంచి ఒకతులం బంగారం తెచ్చుకున్నాను. దాంతో మొలతాడు చేయించాను. తన మొగుడు అంగడినుంచి తెచ్చియిచ్చినంతమాత్రాన తన మొగుడే చేయించిపెట్టాడేం? ఔను. వేలకు వేలు రూపాయలు గడిస్తున్నాడు కాదూ తన మొగుడు! ఏం చెప్పమన్నావు దాని విరగబాటు...ఆఁ... యింకేమి ఆడిపోసుకుందీ?

జీనవ్వ : అయ్యో! అబద్ధం నాకెందుకమ్మా! ఒకరిమీద చాడీలు... అయినా, చూడండమ్మా రుక్మిణీబాయి గారూ! ఎప్పుడు మీ అత్త పోయిందో, అప్పుడే మీ ఇంటి మట్టూ మర్యాదా చెడిపోయింది చూడండి ... మరి మీ కేమో పొద్దస్తమానమూ వేయించి వేయించి బలి సింపుతారూ అని గోలకెత్తింది.

రుక్మిణీబాయి : చూడరా దవ్వా ఎలావుందో? అదేమో అంటావుగదా —

జీనవ్వ : కాదు. అయితే మీరు హాయిగా... (గొంతు తగ్గించి) ఎందుకు వేరుపడిపోగూడదూ అంటాను.

రుక్మిణీబాయి : ఎందుకు వేరై పోవాలంటావు జీనవ్వా! మొగుడూ పెళ్ళాం వేరై పోయేరు. తండ్రీ పిల్లలూ వేరై పోయేరు. పెళ్ళాలు పిల్లలూ వేరై పోయేరు. ఈ అన్నా తమ్ముడూమాత్రం వేరై పోయేట్టులేరు. అన్నాతమ్ముడూ అంటే పొందిగ్గాచేరి పుట్టిన ధాన్యంగింజలాంటివాళ్ళు. పప్పుగింజలాగ వేరే అయిపోయేవారు కారు.

జీవవ్వ: కాదూ, అన్నా తమ్ముడూ సఖ్యంగా వుండనివ్వండి. దాన్ని ఎవరు కాదంటారు? అయితే, మొదట తను పెళ్లాం పిల్లల్ని సుఖపెట్టి, ఆమీద తమ్ముణ్ని సుఖపెట్టాలి కదటమ్మా!

రుక్మిణీబాయి: అయ్యో! మొదట తనసంగతే తనకు లేనట్టు తమ్ముని మీద ప్రీతిచూపేటప్పుడు అదేదో అంటారే... తమ్ముడికి చదువు చెప్పించాలంటూ వచ్చిన జీతమంతా చదువుకే పోసేశా రవ్వా. ఇంట్లో బియ్యం, జొన్నలు వున్నాయా లేవా అనే సంగతి విచారించనంత అబ్బరంగా చదివించారు తమ్ముణ్ని. రేపు అదే తమ్ముడు నిలబడినవారిని నిలబడినట్టుగా వీరిని వెలుపలికి తోయక పోతే చూస్తూవుండు... (వెళ్ళిపోతుంది)

జీవవ్వ: పొద్దుపోయిందమ్మా. కాసిని బియ్యం వేయించమ్మా లక్ష్మంబాయి. (లక్ష్మంబాయి మళ్ళీ వచ్చి ఉపాదానం చెంబులో బియ్యం వడేస్తుంది. కొన్ని గింజలు కింద ఒలికిపోతాయి. తర్వాత లక్ష్మంబాయి దీపం మొదలయిన వాటిని ఎత్తిపెట్టడం ప్రారంభిస్తుంది.)

లక్ష్మంబాయి: ఎందుకమ్మా! మళ్ళా ఏమిజరిగింది? చెప్పావుకదూ మా పైన చాడీలు.

జీవవ్వ: (నవ్వుతూ) అయ్యో! వదలిపెట్టమ్మా లక్ష్మంబాయి ఆ సంగతి. వట్టి అబద్ధం... చూడమ్మా, నేను మీ నడుమవచ్చాను అని కాకూడదు... కాదూ, పిల్లవానికి మొలతాడు చేయించడానికి నీ మురుగులు చెరిపించింది అబద్ధమటగా? నీ మొగుడే నీ మురుగులు అమ్మకున్నాట్ట.

(లక్ష్మింబాయి గాబరాపడి కూచుంటుంది.) ఆవిడ తన కొడుక్కు మొలతాడు చేయించడానికి బంగారమేమో పుట్టింటినుంచి తెచ్చుకుందిట కదూ? వాళ్ళతండ్రి పది తులాల బంగారం ఇచ్చారట!

లక్ష్మింబాయి : అయ్యయ్యో! చాలా వుంది పుట్టింటివాళ్ళు చేసింది. చెప్పడానికే వీల్లేదు. బారసాలనాడు ఒక్క వెండిగిన్నెకూడా ఇవ్వలేదని ఊరు జనమంతా అంటున్నారు యిప్పటికీ.

జీవవ్వ : అవునా, అలాంటిది మీ పుట్టింటివారంటే దుగ్గాణికి గతిలేనివాళ్ళని నీమీదే ఆడిపోసుకుంది.

లక్ష్మింబాయి : మా పుట్టింటివారికేం, వాళ్ళు హాయిగా తిని, మా యిద్దర్నీ ఇంట్లో పెట్టుకుని పోషించడానికికూడా కావలసినంత వుంది. ఆమాత్రం యిచ్చాడు దేవుడు మా నాన్నకు.

జీవవ్వ : అయితే చల్లగా పుట్టింటికి పోయి ఉండరాదుటే మాతల్లీ, ఇక్కడింత రొష్టుపడడంకన్నా.

లక్ష్మింబాయి : అయ్యో! రేపు పేళ్ళే మళ్ళీ ఎగతాళి చేస్తారు - మొగుణ్ణి వదలిపెట్టిపోయిందీ అని.

జీవవ్వ : మొగుణ్ణికూడా వెంటపిలుచుకునే వెళ్లూ.

లక్ష్మింబాయి : అయ్యయ్యో! తోడబుట్టిన అన్నగారిని వదలి ఆయన ఎలా వస్తారు, జీవవ్వా!...కుక్కలాగ ఇక్కడ ఛీ ఛా అనిపించుకుంటూ తింటేనే వారికి ఒంటబడుతుంది అన్నం. అక్కడికి ఎందుకు వస్తారవ్వా? ఇంకా ఇక్కడ అనిపించుకునేది చాలా ఉంది. ఆడిపో

యించుకొనేది ఎంతో ఉంది......మొన్న భోజనానికి కూచున్నప్పుడు ప్రత్యక్షంగా వీరికి ఆరిపోయిన అన్నం పెట్టారు... రేపో ఎల్లుండో విస్తట్లో మన్ను వేసి తినిపిస్తారు చూడండి జీవవ్వా. కానీ అదికూడా అయింతగానే బుద్ధిరానీ...ఇంకా చాలా ఉంది జీవవ్వా కావలసింది. (కన్నీళ్లు) నిన్నటిదినం తప్పులేకపోయినా నా మీద తప్పు మోపారు. స్వయంగా బానగారే ఇంక చెయ్యి చేసుకుని కొట్టడం ఒకటి మిగిలింది. తోడికోడళ్ళు కొట్టడమంతా......

జీవవ్వ : (ముఖంచిట్లించుకొని పెద్దగా నిట్టూర్చి ఎంతో సేపు లక్ష్మింబాయి చెవిలో ఏమేమో చెబుతుంది. తర్వాత నెమ్మదిగా) ఎంత చెప్పా, నువ్వు మాత్రం వదలకు... (లోపలికి తొంగిచూచి) ఊఁ...పోయివస్తానండమ్మా రుక్మిణీబాయిగారూ. (వెళ్ళిపోతుంది. లక్ష్మింబాయి "హుఁ" అంటూ మెడవాల్చి నడిమింటినుంచి తన మొగుడి గదికి వెళ్ళుతుంది. గది ఇక్కడ కనిపించదు.)

రుక్మిణీబాయి : (ప్రవేశించి నేలమీదపడ్డ బియ్యపు గింజలను చూసి లోపలివైపుచూస్తూ జీవవ్వ ఉందని తెలుసుకుని ఆమెకు తెలియాలని) చూచారామ్మా, ఎలా ఒలకబోస్తూందో బియ్యాన్ని. హుఁ! తమ పొగరు ఇలా ఒలికిపోయిందీ అని తెలుపుతున్నారు...ఇంటికి వచ్చిన మగవారికి నేనే నేనే ఇలా చేశానని అనిపించాలి మరి. ఇలాంటి వల్లమాలినపనులూను-మరి పెద్దలనిపించుకొనేది అందుకే కదూ చేసినవారి తప్పులన్నీ మీద వేసుకోడా

నికి! ఈ మోసకారితనం వెలుపలినుంచి వచ్చినవారికి ఏమి తెలుస్తుంది. ఇలాటివే నవ్వా వెదుకుతూఉంటుంది నన్ను తిట్టించడానికి. (శ్రీపాదరావు ప్రవేశిస్తాడు.) చేయనీ-చేయనీ అదెంతవరకు నాకు చెరుపుచేయా లనుకుంటుందో, అంతా చెయ్యనీ ఒకేసారి. (మొగుణ్ణి చూచి) ఇదో! ఇది చూడండి, ఎవరు బియ్యం ఒలక బోసిపోయారు అనేది.

శ్రీపాదరావు: ఆఁ! ఇదేమిటి ఒక్కొమారు?... (క్రింద చూచి) అన్నిబియ్యం ఎలా ఒలికిపోయాయి?

రుక్మిణీబాయి : ఎలా యేమిటి? బిచ్చం వేసేలక్షణం అది.

శ్రీపాదరావు: ఎవరు వేసినవారు?

రుక్మిణీబాయి : ఎవరేమిటి? ఉందిగా సంపన్నురాలు తోడి కోడలు.

శ్రీపాదరావు: పోనీ నువ్వే వెయ్యగూడదూ ఆ బిచ్చ మేదో.

రుక్మిణీబాయి : మడికట్టుకున్నాను అని వేయలేదు. అంతే కాని, నాచేతులేమీ అలసిపోయేవికావు వేసిఉంటే... ఆ సంగతే చూచుకోండి అన్నాను. కండ్లకు ప్రత్య క్షంగా కనిపిస్తున్నది కదా, మీకు ఎంత మంచిమరదలు వచ్చిపడింది అనేది.

శ్రీపాదరావు: కాదే! యెంతైనా నువ్వు పెద్దదానివి! చిన్నవారిని సర్దుకునిపోవాలి. ఇలాఎందుకు కాచిన పెనం లాగ మండిపడతావు?

రుక్మిణీబాయి : అల్లాంటి సంసారం - అయింది. ఔను ఆ

కాచినపెనంలో నీరుపోసినట్టు ఉంది. నే నేమైనా చేస్తే హుమ్మని మీదపడేవారు. ఇప్పుడు కంటికి కనిపించినా మాట్లాడక ఊరుకుంటున్నారు.

శ్రీపాదరావు: ఏదో కంటికి కనిపించిందీ అని నువ్వు చెప్పే దంతా నిజమంటావా... ! కాదూ, ఒక వేళ నిజమే అయినా నీవు పెద్దదానివి కొంచెం ఓపికపట్టాలి.

రుక్మిణీబాయి : ఆవిడకు నేను చేసిన మహోపకారం ఏమిటీ అంట...

శ్రీపాదరావు: పాపం ! ముక్కుపచ్చలారని పిల్లగానటే ! అలాంటిదానికి ఎందుకే పేర్లు పెడతావ్ ?

రుక్మిణీబాయి : ధర్మరాజులాగ ఇలా బోళాతనానికి దిగే పాడై పోతారు.

శ్రీపాదరావు: ఇదేమి కలియుగ మహాభారతమా ?

రుక్మిణీబాయి : మరి మహాభారతం ముగిసిం తర్వాతేగా కలిప్రవేశం జరిగింది.

శ్రీపాదరావు: అది సరేలే. ఏమైనా ఒకరిమీద ఒకరు చాడీలు చెప్పడం ప్రారంభించారు. నీకు ఇప్పుడు ఇంత కోపానికి కారణమేమిటీ అంట ?

రుక్మిణీబాయి : ఇంకా కారణమేమిటి కావాలండీ. ఒక్కటైనా చెప్పినమాట వినిపించుకుంటేగద.

శ్రీపాదరావు: అలాకాదే. ఏమైనా నువ్వు పెద్దదానివునా. పోట్లాటరావడానికి కారణమేమిటీ అంట. నీ పని నీవు చేసుకో, ఆమెపని ఆమె చేసుకుంటుంది.

రుక్మిణీబాయి : చాలా చేస్తుంది. చేసేరకమే. చెప్పేట్టే లేదు,

రెండుపూటలూ వంట, వార్పూ, పైనీళ్లు నుడినీళ్ళూ—పని అంతా నేను చూసుకుంటూఉంటే నే ఊళ్లోవాళ్ళతో ఆవిడ నన్ను ఆడిపోసుకుంటూఉంది. నిజంగా నేనే ఆవిడచేత పనిచేయిస్తే ఇంకా ఏమనేదో ఈ మాయల మల్లి... ఈవిడేమో దీపాలకి నూనెమాత్రం పోస్తుందట. ఏమో రేపు నవరాత్రిలో ఈవిడ వంట పెద్దదేవుని నైవేద్యానికి పనికిరాదని, వంటమాత్రం నే జేసుకుంటాననీ అని అన్నక్షణాన, ఏమిటె, ఈ అమ్మగారిని పనికి రాజీనామాయిమ్మని చెప్పినట్లా? ఒక పొయ్యిముందు కూరగాయలు తరిగిపెట్టుకోవడం అనిలేదు; ఒక పాచిపని అని లేదు; ఒక పాత్రలు కడుక్కోవడం అని లేదు. అవన్నీ వదలిపెట్టి పొద్దస్తమానమూ ఒక్క దీపాలకి నూనె పోసుకుంటూ కూర్చుంటుందా?

శ్రీపాదరావు: కొంచెం విరామంఇచ్చి మాట్లాడవే....., ఏమైనా నువ్వు పెద్దదానివి. ఈమాట అయినా ఒప్పుకుంటావా?

రుక్మిణీబాయి: వట్టిచాకిరీకేమో పెద్దదాన్నే—ఒళ్ళునేది పిండి పిప్పిఅవ్వాలాగ. ఆపైన సౌభాగ్యం అనే మాటలన్నీ అనిపించుకోవాలి. తిట్లన్నీ తినాలి. పెద్దలమాటంటే కాలిచెత్త......

శ్రీపాదరావు: ఇప్పుడు ఆమె నీమాట విననిది ఏముంది?

రుక్మిణీబాయి: ఏమివిన్నదీ అని అడగండి. పొద్దున లేచి ఒక గడప అలికి ముగ్గుపెట్టడం చేతకాదే ఈ నంగనాచికి! పాపం! ఐదుమల్లెపూలతూకంపిల్ల!

శ్రీపాదరావు : అలాఅయితే ఇలా చేయండి. గడప ఎంత, మూడుఅడుగులుంది కదూ? ఒకటిన్నర అడుగు నువ్వు ముగ్గువెయ్యి. ఒకటిన్నరఅడుగు ఆమెను వేయనీ.

రుక్మిణీబాయి : నేను సరిచేట్టు లేదు. చెప్పవలసివచ్చేసరికి నావి అన్నీ అసందర్భపు మాటలే అయినయ్...... (గంభీరంగా) నే నెంత ఒళ్లువిరుచుకొని పనిచేస్తే అంత ఆమెకు సంతోషం. తెలిసిందా? నా కెంత చెనుపయితే ఆమెకు అంత హితం. నేనంటే నే ఓర్వలేకపోతోంది. నేను ఒక్క నగానట్రా పెట్టుకోరాదు. పెట్టుకొంటే ఈమె గొంతులో కారంకలిపి పోసినట్టు అవుతుంది. తాను చూస్తే ఎడమతట్టు పాపట, నేలపై జీరాడేట్టు ఆ చీర......

శ్రీపాదరావు : అలా చేయకూడదని నీవు బుద్ధి చెప్పాలి.

రుక్మిణీబాయి : అయ్యో! అయ్యో! "చేసుకున్న హాళ్ళి మాట్లాడకుండానే ఊరుకున్నారు. సంధ్య వేళా పోయి జోరైందే. మీ కెందుకు మా గొడవ" అని ఒకప్రక్క నోరునొక్కుతూఉంటే మీరు నన్ను నీతులు చెప్పనుంటారు!........

శ్రీపాదరావు : కాదే. మెల్లగా నచ్చేట్టు చెప్పాలి.

రుక్మిణీబాయి: "ఎవరిమాటలతో నీకేం పనిలే! నే చెపుతున్నాను, నువ్వు సరదాగాఉండు" అని భర్తగారే చెపుతున్నాడట. పెళ్లానికి కావలసినవన్నీ దొంగతనంగా తెచ్చిస్తాడట తినడానికి. (ఆవేశంతో) మొన్న ఇద్దరూ తింటూ కూచున్నప్పుడు పిల్లవాడు వెళ్ళితే కొట్టి పంపారట.

ఏడుస్తూ వచ్చి చెప్పాడు, బిడ్డ. పిల్లలనువదలి తినడా నికి వీళ్ళ గొంతు ఎలా దిగిందో! పిల్లలమీదే వాళ్ళ అక్కసు చూపించాలా?...... (కన్నీళ్ళు) పిల్లలంటే అంతా ఒక్కటేనని నేను అనుకున్నాను.

శ్రీపాదరావు: (కష్టమనిపించి) ఔనే, పాపం! వాళ్లుకూడా ఇంకా పిల్లలే. పిల్లలముద్దు కన్నవారికి తెలుస్తుంది... పాపం! ఏదో తినివుంటారు. పిల్లవాడు వెళ్ళేటప్పటికి అయిపోయివుంటుంది. అందుకు ఏడుస్తూవచ్చాడేమో బిడ్డ. పిల్లవానికి తినడానికి ఏదయినా కావలసివుంటే, నాకుచెప్పితే సరిపోయేది. నేను తెచ్చిపెట్టేవాణ్ణి.

రుక్మిణీబాయి: (కన్నీళ్ళుకారుస్తూ) మా మాట మీకు ఎలా నిజమనితోస్తుందిలెండి!

శ్రీపాదరావు: శ్రీధరుడిస్వభావం చాల కలుపుగోలుతనం జాలిగల స్వభావం. వాడివిషయంలో ఏమయినా చెడ్డ చెబితే నా కడుపులో కలియబెట్టినట్టు అవుతుంది చూడు. పిల్లవాళ్ళమొనప్పుడు నాలుగు పెసుగటుకులు తినేటప్పుడు కూడా నన్నువదలి తినలేదు శ్రీధరుడు.

రుక్మిణీబాయి: (నిట్టూర్చి) కానీలెండి. మీ మీ కలుపు గోలుతనాలు మీరే చూస్తారు.

శ్రీపాదరావు: ఊరుకో! నువ్వు ఏమన్నా అను. చిన్నపిల్ల వాడుగా వున్నప్పటినుంచి చూస్తూవస్తున్నాను శ్రీధరుని స్వభావం. పిల్లలవంటి మెత్తని పూవులాంటి మనస్సు వాడిది... తనకోసమని మా నాన్న కొత్తబట్టలుకుట్టిస్తే 'అన్నా నీకు సరిపోతాయా, చూడు' అనేవాడు. వాడికి

ఆటల్లో బహుమతిగావచ్చిన వెండికప్పు తెచ్చి నాకు ఇచ్చాడు. శ్రీధరుడు ఎంత కలుపుగోలుతనం గలవాడనేది నే నేమిచెప్పను. మా నాన్న చనిపోయి, మే మిద్దరం పరదేశులమై మామయింట్లో వుండేవాళ్ళం. అప్పుడు ఒకరోజున—

[రంగస్థలంమీద చీకటి. తెరవెనుకనుంచి రెండు సన్నని ధ్వనులు వినిపిస్తాయి.]

శ్రీధరరావు : (దూరంనుంచి) అన్నయ్యా, అన్నయ్యా. ఆగు ఆగు. (దగ్గరికి వచ్చి) ఆగు అన్నయ్యా.

శ్రీపాదరావు : ఎందుకు?

శ్రీధరరావు : ఇదుగో తీసుకో. నరి మీ కాలేజి వార్షికోత్సవం చందా యివ్వడానికి మామయ్య తనదగ్గర డబ్బు లేదన్నాడుకదూ? నా దగ్గర దాచుకున్నవి మూడురూపాయలు వున్నాయి, తీసుకో. అన్నయ్యా, నువ్వు సుఖంచిన్నబుచ్చుకుని ఒంటిగా వెలుపలికివచ్చావే అని నాకు ఎలాగో అనిపించింది. చూడు, ఇంతమందిపిల్లలు వార్షికోత్సవంలో వుత్సాహంతో పాల్గొంటూవుండగా, నువ్వు గూబలాగ కూచోవలసివచ్చిందికదా అని అనిపించింది. పోయినసారి అత్తయ్య వచ్చినపుడు డబ్బు ఇచ్చిపోయిందిగా. అది దాచుకొన్నాను.

శ్రీపాదరావు : శ్రీధరా, ఎలాంటి జాలిమనస్సురా నీది ...అయితే పాపం! నువ్వు రోజూ వుదయం 11 గంటలకు అన్నంతిని బడికిపోయి సాయంత్రం ఎప్పుడో ఇంటికి

వస్తావు. మధ్య విరామంలో నీకు చిరుతిండి కావద్దూ ?
దానికోసమేగదరా అత్తయ్య ఇచ్చింది.

శ్రీధరం : ఏమీ వద్దులే. ఒక గడియ విరామం ఎలాగో గడి
పేస్తే ఆపైన పాఠాలు ఆరంభమైంతర్వాత ఆకలి జ్ఞాప
కంరాదు.

శ్రీపాదరావు : బంగారంసంటి మనసురా నీది శ్రీధరా.
ఈవేళ నువ్వుచేసిన వుపకారం నేను మరిచిపోను...
చూడు శ్రీధరా, రేపు నేను పెద్దవాణ్నయి డబ్బు
సంపాయించేటప్పుడు——

శ్రీధరరావు : ఈ మూడురూపాయలు అప్పుడు తీరు
ద్దువుగానిలే! (నవ్వుతాడు)

శ్రీపాదరావు : అదికాదు తమ్ముడూ, నే చెప్పేది. రేపు
నేను పెద్దవాణ్నయి గడించానంటే ఈ మూడురూపా
యలకు నూరురెట్లిచ్చినా ఇప్పుడు నీవుచేసిన వుపకారం
తీరనిది.

శ్రీధరరావు: పో అన్నయ్యా. అన్నాదమ్ములమధ్య ఏమిటో
వుపకారం గిపకారం అంటావేమిటి?

శ్రీపాదరావు : (కౌగిలించుకొని) ఇలాగే చివరదాకావుండా
లిరా తమ్ముడూ నీ మనసు.

శ్రీధరరావు : అన్నయ్యా! మొన్న మా బడిలో ఒక
తమాషా జరిగింది. మా మాష్టరు రామాయణం
మంచిదా, మహాభారతం మంచిదా అని నన్ను అడిగారు.

శ్రీపాదరావు : నువ్వు ఏమి చెప్పావు?

శ్రీధరరావు : రామాయణం మంచిదన్నాను.

శ్రీపాదరావు : ఎందుకని ?

శ్రీధరరావు : ఆ రామాయణంలో రామలక్ష్మణులు ఎంత మంచి అన్నాదమ్ములో మనకు తెలుస్తుంది. మహాభారతం నూటాయెనిమిదిమంది అన్నదమ్ములూ యెలా కొట్టుకొని నాశనమయిందీ తెలుపుతుంది అన్నాను.

శ్రీపాదరావు : దానికి మాస్టరు ఏమి చెప్పారు ?

శ్రీధరరావు : అలాఅయితే ఇళ్లల్లో మహాభారతం ఆడకండి సుమా అన్నారు !

శ్రీపాదరావు : అయితే, మా ప్రొఫెసరు కురుక్షేత్రయుద్ధం కోసమన్నా మహాభారతం చదవాలి అన్నారు. మా కాలేజీలో భగవద్గీత ఆరంభించారు. శ్రీకృష్ణుడు కురుక్షేత్రంలో అర్జునునికి కర్మయోగం అంటే యేమిటో, అనాసక్తియోగం అంటే యేమిటో, స్థితప్రజ్ఞుడు అంటే యెవరో తెలిపాడు - ఇవన్నీ గీత మనకు తెలుపుతోంది అని చెప్పారు.

శ్రీధరరావు : అయితే, నాకు రామాయణం కథ బాగా తెలుసును అనుకోవచ్చు. కాని, గీతలోసంగతులు తెలుసుకోవాలంటే నేనూ కాలేజీకి రావాలి. ఆమీదట నువ్వు చెబుదూగాని ఇంట్లో...

[ రంగస్థలంలో నెమ్మదిగా వెలుతురువస్తుంది. సన్నధ్వనులు మరుగైపోతాయి. శ్రీపాదరావు, రుక్మిణీబాయి నిలబడి ఉంటారు. ]

రుక్మిణీబాయి : చూడండి, ఇప్పుడేమి గీతోపదేశంచేస్తారో, రామాయణమే చెబుతారో.

[తెరవెనుక గుసగుసలు వినబడగా, రుక్మిణీబాయి చెవిఒగ్గుతుంది.]

లక్ష్మంబాయి: పాండవకౌరవులు కాదట. రామలక్ష్మణులట. రాముడనేవాడే రావణుడైతే ఏంజేస్తారు?... కౌరవుల చేతుల్లో ద్రౌపది, కీచకునిచేతుల్లో సైరంధ్రిలాగ నేను ఇక్కడ నరకం అనుభవిస్తూ కూచుంటాను. మీరు కళ్ళుమూసుకొని, చెవుల్లో వేళ్ళుపెట్టుకొని కూర్చోండి స్థితప్రజ్ఞణ్ణని...

[శ్రీధరరావు ఒక్కసారిగా రెచ్చిపోయి వస్తాడు.]

శ్రీధరరావు : ఈరోజు మొదలు – ఇప్పుడే నిలుచున్నపళంగా వేరుపడిపోయి రెండోపని చూడాలి...హుఁ... పిల్ల పిల్లాటలాగ కనిపిస్తుందేఁ?......ఈ రోజునుంచి మనం ఇక ఈ ఇంట్లో కాలుపెట్టవద్దు.

శ్రీపాదరావు : తమ్ముడూ...

శ్రీధరరావు : తమ్ముడు! పెండ్లికాకముందు తమ్ముడు, పెండ్లిఅయినతర్వాత భాగస్థుడు.

శ్రీపాదరావు : అలా ఎందుకురా మాట్లాడుతావు?

శ్రీధరరావు : వారెవా! ఎప్పుడు నేర్చుకున్నావు ఇలాంటి వేషాలు? ఇద్దరూ ముసుగూ, పెండ్లాం ఏమనిపించావు దాన్ని? పెంపుడుకుక్క. అనడానికి అలుసుగనుకు న్నావూ? మా యింట్లో ఉండనక్కు, పుట్టింటికి వెళ్ళు, అన డానికి అదేమి మీయింటికి కూడులేక వచ్చిందా? దీపాల్లో నూనెపోసి, వొత్తి వేసి చేసుకుంటాను అంటే

మొగుడూ-పెళ్ళాం కలిసి ఒళ్లు హూనంచేసి పంపుతారా? మగవాడివైయుండి రెండో ఆడదాన్ని తాకడానికి నీకు సిగ్గులేదూ ?

[శ్రీపాదరావు దిగ్భ్రాంతుడై రుక్మిణీబాయి వేపు రెప్పవేయకుండా చూస్తూ నిలబడిపోతాడు. రుక్మిణీబాయికళ్ళల్లోంచి కన్నీళ్ళు దొర్లుతాయి.]

( తెర )

—o—

# అతిథిమర్యాద

## శ్రీ నా. కస్తూరి

నా. కస్తూరిగారు కన్నడనాడు జనప్రియ రచయితలలో ఒకరు. నవ్వు తరగలు రేపే రచయితలు - అనే విఖ్యాతి వారికి వుంది. అయినా, వారు చరిత్ర, సాంఘికశాస్త్రం మొదలయిన గంభీర భావనలను గురించి గ్రంథాలు వ్రాశారు. నాటకం, నవల, హాస్యప్రబంధం - ఈ రంగాలలో వీరి రచన విపులం. ఈ సాహిత్య ప్రక్రియలలో వాక్చాతుర్యాన్ని, సన్నివేశాన్ని హాస్యోత్పాదనకు ఉపకరణంగా ఉపయోగించుకొనడం కస్తూరిగారి పద్ధతి. కాని, 'అతిథిమర్యాద' లో సన్నివేశానికి ప్రధానస్థానం లభించింది.

## పాత్రలు

లలిత
సీతమ్మ
లక్ష్మమ్మ
ఆమె
సరసు

# అతిథిమర్యాద

[మైసూరునగరంలో ఒక మధ్యతరగతికుటుంబం ఇల్లు. ఇంటి యజమానురాలు సీతమ్మ, తనకుమార్తె లలితపై కేకలువేస్తూఉంటుంది. లలిత ఏడుస్తూ ఉంటుంది.]

లలిత : (ఏడుస్తూ) ఉంగరమమ్మా! ఎర్రరాళ్ళ ఉంగరం! కొని ఇవ్వమ్మా......

సీతమ్మ : (కోపంతో) వాయించేస్తాను చూడు, వీపుపైన నాల్గు!...వాళ్ళకేమి, పెద్దవాళ్ళు కావలసినంత చేసూ చెట్టూ వదలిపెట్టివెళ్ళారు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క ఉంగరం కొనుక్కున్నారు ... ఒక్కొక్క వేలికీ ఒక్కొక్క ఉంగరం పెట్టుకొనేత్రాణ వారికుంది... నీవు అలాటి శ్రీమంతులఇంట్లో పుట్టే పుణ్యాం పొంద లేదు. నే నేంచేయను దానికి... మీ నాన్న సంపాదన నా పొట్టకే చాలదు. (కుమార్తె కన్నీళ్ళు తుడుస్తూ) ఇక్కడికి రావే, ఇక్కడికి! వారంతా ఊరికి వెళ్ళనీ... ఈ అప్పంతా తీరనీ...మా కెవ్వరికీ వద్దు, ఉంగరం నీకే మొదలు...ఏ వేలికి చెప్పు...ఎలాంటిరాయి?.... (కుమార్తె చెక్కిలి పట్టుకుని, మొగం నిమిరి, ఒళ్ళో కూచోపెట్టుకుంటూ, తను నేలమీదికి ఒరుగుతూ, చీర చెంగుతో గాలి విసురుకుంటూ ఉండగా...)

లక్ష్మమ్మ : (ప్రవేశించి) ఏం వేళ? ఏమి చేస్తున్నారు...

సీతమ్మ : (లేచి) రండి లక్ష్మమ్మగారూ! (చూపిస్తూ) లలితా! వెళ్ళి అడుక్కోమ్మా ... శాణాకదూ ... కూర్చోండి ... చాల అపురూపమైపోయారే మీరు ఈమధ్య.

లక్ష్మమ్మ : (నవ్వుతూ) నేనా మీరా, అపురూపం? నవరాత్రి పండుగ పదినాళ్లు నడిచిందికదా, ఒక్కనాడన్నా మీరు మా యింటికి రావద్దూ? బొమ్మలకొలువుకు హారతిఅని చెప్పి పంపుతూనే ఉన్నాను కదా!

సీతమ్మ : (వేడిగా నిట్టూరుస్తూ) అయ్యో! ప్రాణంపోయే వేళ వీణవినడానికి వెళ్ళింది అన్నట్లు, నాకు ఎక్కడి బొమ్మలకొలువు, ఎక్కడి హారతి...మా యింట్లో ఈఏడు బొమ్మలకొలువు పెట్టలేదు...దొమ్మి జరుగుతూ ఉంది. పది పదిహేనురోజులుగా విపరీతంగా గలాటా... ఎక్కడినుంచో వచ్చాయి రంగుబొమ్మలు, వారి బంగారం సింగారం, వారి అడావుడి ఇదే.

లక్ష్మమ్మ : చుట్టాలు వచ్చారా?

సీతమ్మ : చుట్టాలైతే అదోవిధం... జాతికాదు, జనం కాదు. ఈ పాడైపోయిన నవరాత్రి వచ్చిందీ అంటే, మైసూరులో ఉండే మనం ఎక్కడికో దేశాంతరం వెళ్ళడమే సుఖం...కన్నవాళ్ళకందరికీ చక్కగా భోజనం వడ్డించి, వాళ్ళ పిల్లల ముక్కు మొగం తుడిచి, జడలు అల్లి...

లక్ష్మమ్మ : ఎక్కడనుంచి వచ్చారూ? మీకు గుర్తూ, పరి

చయం ఏమీలేదా? ఉన్నదున్నట్టే ఇలా ఊడిపడితే, పాపం, మీరుమాత్రం ఏంచేసేరు...

సీతమ్మ : వీరితోపాటు ఎక్కడో ఎప్పుడో చదువుకున్నారట. ఒకే హాస్టలులో ఉన్నారట...నిరుడు అకస్మాత్తుగా బెంగళూరు రైలుస్టేషనులో కలుసుకున్నారట... ఓహో హో హో...ఏమోయ్...ఎక్కడ ...అంటూ ఒకరినొకరు పాతస్నేహం తిరగేసుకున్నారట... ఇదే సమయమని, ఆయన మా అడ్రెస్ సంపాదించి, నవరాత్రివరకు కాచుకూర్చుని, వస్తాను అని లెటర్ వ్రాసేశాడు...ముఖ్యమైంది. మా గ్రహచారం...ఆయన్ని తిట్టి ఏం ఫలం!

లక్షమ్మ : (సానుభూతి చూపుతూ) వెనుకటిజన్మలో ఋణం అనండి.

సీతమ్మ : ఈ ఊరివాళ్ళు నవరాత్రి అంటే ఊరుకుంటారా? నెయ్యివైభవాలు ... పేపర్లలో ప్రకటనలు... నేను అన్నానూ వీరితో, 'ఊళ్లో ఉండను అని వ్రాయండి! నాకు జర్వం అనండి' అన్నాను...వీరికి అభిమానం; చిన్ననాటి నేస్తం అనే ఉత్సాహం... ఇప్పుడు వీరికీ అనుభవానికి వచ్చింది...

లక్షమ్మ : ఇంకా వెళ్ళిపోలేదూ వాళ్లు? ఊరికివ్వారే ఖాళీ అయిపోయింది కదండీ.

సీతమ్మ : ఎందుకు వెళ్ళిపోతారు, ఉదయం మధ్యాహ్నం సాయంత్రం నేను పుష్కలంగా వండిపెడుతున్నప్పుడు? ఆ మగవాడికి గోధుమన్నం. ఆ ఆవిడకు పుల్లమజ్జిగ

పడదు. పిల్లలందరికీ ఆవుపాలే కావాలి... సింగేస్తున్నా
రనుకో మా పంచప్రాణాలుగా......సిల్కు ఫ్యాక్టరీ
అయింది...నిన్న; చందనంమాను ఫ్యాక్టరీలుట ఈ
పూట...పోయాను, పటాలనంతా గొంతువరకు ఉప్మా
నింపుకొని...కారులో...

లక్షమ్మ : మోటారు కారులోనే వచ్చారా ?

సీతమ్మ : హుఁ... కాకొకటి కన్నవారి ఇంటికి తలుపులు
మింగే వాళ్ళ యోగత్యకు; వాళ్ళ కాదు, వారిద్దరివగు, వారి
నౌకరు, అందరికీ ఇక్కడ పంచభక్ష్యపరమాన్న
శుశ్రూష...సాంగోపాంగంగా...పిల్లలలో పిల్లలలో అర
డజను ఉన్నాయి. పొట్టమూతి, వంకరగోక, వారకళ్లు
అవలక్షణం — ఒకదానికంటె ఒకటి — లలితమానసా
వాటికీ ముప్పూటలూ పోట్లాట...అవి వచ్చి, వక్రించిన
ప్పటినుంచీ లలిత ఏవేవో పాడు పాడు మాటలన్నీ
నేర్చుకుంది.........

లక్షమ్మ : అయ్యో! అయ్యో! ఇలా అయిందా నీ
అవస్థ? మా యింటికి మీరు ఒక్క రోజూ రాలేదు.
ఎక్కడో ఎగ్జిబిషన్ వైపు వెళ్ళుతున్నారు, నాటకాలు
సినిమాలు అని ఆ హడావుడిలో ఉన్నారు అనుకు
న్నాను...

సీతమ్మ : ఆ పుణ్యమంతా వాగే సంపాదించుకొనివచ్చారు.
సత్రంవలె ఉంది ఈ యిల్లు. పొద్దుపొడవగానే, కాఫీలు
కావాలి. కన్నంబాడి (బృందావనం) కి వెళ్ళాలంటారు.
సాయంకాలం రవ్వహల్వా, గారెలు కావాలి. శ్రీరంగ

పట్టణం వెళ్ళడానికి మధ్యాహ్నం పెరుగన్నం కాస్త యివ్వండి. చాముండికొండ వెళ్తాం అంటారు....నంజన గూడు వెళ్ళడానికి నిమ్మపండ్ల చిత్రాన్నం.... వాళ్ళకే ముంది, దగ్గుతూ తుమ్ముతూ వంటఇంటివాకిట్లోకి తొంగి చూసి, క్షమించు, సీతా అంటారు...... పిచ్చిపిచ్చిగా నవ్వుతారు...పళ్ళికిలిస్తారు. మగవాళ్లు మగవాళ్లు స్నేహ మయితే. మన కెందుకు లక్షుమ్మగారూ ఈ చిత్ర హింస.......?

లక్షుమ్మ : ఊరుకోండి ! ఊరుకోండి ! అదిగో, వచ్చినట్టు న్నారు...ఏదో కారువచ్చింది.

సీతమ్మ : రానీ ! రానీ ! వాళ్ళఊరినుంచి ఒక కారు వచ్చింది....వాళ్ళఅమ్మాయినుంచి.....మనమ్మడికి ఒళ్లు బాగాలేదని ఆమెకూడా చెప్తూఉంది......ఆ పాపడికి కొంచెం జాస్తిఅయిందట, జ్వరం......

లక్షుమ్మ : ఇదేమిటండీ, అన్యాయం ! సంసారులు ఇలా ఇల్లూవాకిలి వదిలిపెట్టి నెలలతరబడి, మరొకరియింట్లో వేళ్లుతన్నుకుకూచుంటే ఏమిటిగతి ?

సీతమ్మ : శ్ ! మీరా రిక్కడే ఉండండి, లక్షుమ్మగారూ ! వాళ్ళనూ, వాళ్ళపిల్లల ముఖాలనూ వారి ఆర్భాటాన్ని చూచే వెళ్ళండి...ఎలాగైనా. రానే వచ్చారు......

లక్షుమ్మ : లలిత ఏదీ ? పాపం, దానికెంత బేజారైందో ఏమో !

సీతమ్మ : ఆ కోతులు వస్తే, అవన్నీ గుంపుచేరి దాన్ని ఏడిపి స్తాయి.....ఆ పాడుకారులో దానికి జానెడుజాగా ఇవ్వ

మంటూ అవి మొండితనం చేస్తాయి...ఆ కోతులు వచ్చేలోగానే కాస్త ఆడుకొని వస్తాను అని లలిత వెళ్ళింది, గేటు దగ్గరికి...

[ఆమె ప్రవేశం]

ఏమిటి? రండి; రండి! గంధపునూనె ఫ్యాక్టరీ అంతా చూచారా?...చాల శ్రమఅయినట్లు కనిపిస్తూందే.

ఆమె : అయ్యో! గంధమూ వద్దు ఇప్పుడు, అక్షతలూ వద్దు....మీయింటినుండే తపాలావాడు కనిపించాడు... కవరు ఇచ్చాడు. చింపి చూస్తే, గుండెలు పగిలి పోయాయి. సరసు మొగుడు హైదారాబాదునుంచి నిన్న బెంగళూరికి వచ్చాడట...అతనికళ్ళ కేమో అయిం దట...దేవుడే దిక్కు ... ఆపరేషను కావాలట... వెంటనే మేము ఇప్పటికిప్పుడే బయలుదేరిపోవాలండీ... నిలవడానికి నెమ్మదిగానే లేదు....వాళ్ళందరూ కారు లోనే కూచున్నారు.

సీతమ్మ : గాభరాపడకండి...నిదానంగా...మీరు రానీ... ఇద్దరుస్నేహితులూ కూర్చుని ఆలోచించుకుని ఒక నిర్ధా రణకి రానీండి ...ఉత్తరం మరొకసారి చదవండి... కూర్చోండి...చూడండి, వీరు లక్ష్మమ్మగారు అని... చాలారోజులుగా మాకు పరిచితులు. మిమ్మల్ని వీరి యింటికి, మాతమ్ముడి అత్తగారింటికీ పిలుచుకొని వెళ్ళనేలేదు ... లక్ష్మమ్మగారూ! వీరి పిల్లలు—ముఖ స్తుతికాదు..., చూడండి, చాల తెలివైనవాళ్ళు...

చాల చురుకు...పదిహేను ఇరవైరోజుల నుంచి, ఈ యిల్లు నందగోకులం చేశారు....

ఆమె : మనస్సు స్థిమితంగా లేదండీ. మేము బయలుదేరి వెళ్ళాలి. (చేతిపెట్టెలో కొన్ని సామానులు సర్దుతూ ఉంటుంది.)

లక్ష్మమ్మ : మాయింటికి వచ్చి, బొట్టుపెట్టుకొని వెళ్ళండి... ఇక్కడే ఆ పక్కవీథే మాది...

సీతమ్మ : నా మాట వినండి ! మీవారు వెళ్ళి సంగతి సందర్భాలు తెలుసుకుని, ఉత్తరం వ్రాస్తారు...తర్వాత మీరు బయలుదేరి వెళ్ళవచ్చు...కిట్టనివాళ్ళు కూడా వ్రాయడం కద్దు, ఇలాంటి అశుభాలను. అంత తొందర తొందరగా నిలుచున్నవారు నిలుచున్నట్టుగానే ఎలా బయలుదేర్తారు చెప్పండి ?

ఆమె : అయ్యో ! వీలులేదండి...సరసు, పాపం ! ఏమీ తెలియని గోల...ఆపరేషను, ఆస్పత్రి అంటేనే దానికి ముందు జ్వరం ముంచుకొనివస్తుంది.

లక్ష్మమ్మ – అయితే ఇంకొక్కపని చేయండి.

సీతమ్మ : నేను చెబుతా, లక్ష్మమ్మగారూ ! మీ అల్లుణ్ని ఇక్కడికే రమ్మనండి. వీరికి ఇక్కడివారొకరు గుర్తున్నారు...ఆపరేషన్ అవసరం లేకుండానే కళ్ళువచ్చేట్టు చేస్తారు...తక్షణం ఉత్తరం వ్రాయండి. ఉత్తరం వద్దు... తంతిఇవ్వండి...మా యిల్లేమిటి, మీఇల్లేమిటి ? బాల్య స్నేహమన్నప్పుడుఅంతమాత్రం చనువుతీసుకోకూడదా?

...సరసూను, ఆమె పిల్లల్నీ, ఆమె భర్తనూ నేనూ చూచినట్లు అవుతుంది...

లక్ష్మమ్మ : కళ్ళు నయమైంతర్వాత, ఆయనా చూస్తారు కన్నంబాడీని...

ఆమె : ఛా! ఛా! ఎక్కడైనా ఉందా? అల్లుణ్ణి ఇక్కడికి రా అంటూ నేను ఇక్కడినుంచి ఉత్తరం వ్రాయడం బాగుంటుందా? తప్పు! అంతేకాక, హైదరాబాదు డాక్టరు, బెంగళూరు డాక్టరొకరికి ఉత్తరం వ్రాశారట... అల్లుడికళ్ళకు ఇలాంటిలాంటివాటిని వ్రాశాను, ఇలా ఇలా ఇలా చేశాను అని...మీరేమీ అనుకోకండి...నేను ఈ వేళే బయలుదేరుతాను......

సీతమ్మ : కొంచెం కాఫీపుచ్చుకొని వెళ్ళండి...తియ్యసొజ్జ వండుతాను, మీ ఆఖరి అబ్బాయికి చాలాఇష్టం కొంచెం ఆగండి...సర్దుకోండి, పోవచ్చులెండి ... ఎండ తగ్గి కాస్త చల్లబడంగానే బయలుదేరండి...

ఆమె : వద్దండీ, వద్దు. వాటికోసం ఇప్పుడు ఆపకండి మమ్మల్ని.

[వెలుపల మోటార్ హారన్ శబ్దం]

సీతమ్మ : వినండి. లక్ష్మమ్మగారూ! ఇంతపొద్దున కాఫీ యివ్వక వీళ్ళందరినీ పంపించవచ్చా నేను? మీరైతే ఏంచేసేఉండేవారు?

[మళ్ళా హారన్ చప్పుడు]

లక్ష్మమ్మ: వాళ్ళకు అంత తొందరఅంటే మీరేమి చేస్తారు, పాపం....

[హారన్]

ఆమె : హుం! వినండి. హారన్ కొడుతున్నారు ఆయన అక్కడినుంచి ఒకే ఇదిగా...

సీతమ్మ : పిల్లలకు ఒక్కొక్కకప్పు కాఫీ. వాళ్ళకువద్దు అనకండి.

ఆమె : వద్దండీ, వద్దండీ...దారిలోనే ఎక్కడైనా తాగుతాను...ఇంక వెళ్ళివస్తాను...బొట్టుపెట్టండి...

[హారన్]

సీతమ్మ : (కుంకుమ అందిస్తూ) వెళ్ళిపోతారా? లక్ష్మమ్మగారూ! కారుదగ్గరికి వెళ్ళి, వీరిపిల్లలను ఒక్కసారి చూసిరండి ... ఎంత ముద్దుగా ఉన్నారనుకున్నారు ఒక్కొక్కళ్లూ...

ఆమె : (చేతిపెట్టె పట్టుకుని నిలబడి) మీకు చాల ఇబ్బంది కలిగించాను...

సీతమ్మ : అయ్యో! అనకండీ అంటే అలాటిమాటలు! ఇదంతా పూర్వజన్మలో మేము చేసినఫలం... రేపటినుంచి ఇల్లు బిక్కుబిక్కుమంటూ ఉంటుందికదా! అనే నా యోచన...లలితకు ఇక పొద్దేపోదు.....

ఆమె : అన్నట్లు, అమ్మాయి ఏదీ?

[హారన్]

సీతమ్మ : అక్కడే మీ కారుదగ్గర ఉందేమో!...దానికేమిలెండి? మీ పిల్లలు పాపం ఆకలికి ఎలా తట్టుకుంటారోనని నేను ఇదవుతున్నాను...చూడండి, నేనొక మాట చెబుతాను...నట్టి ఉపచారం అని అనుకోండి...

ఆస్పత్రి ఆపరేషను అయింతర్వాత, సరసూ అల్లుడూ ఇద్దరూ ఇక్కడికి రావాలి)...పదిరోజులు ఉండి. అంత చూచి వెళతారు...మీ అమ్మాయికీ చెప్పండి...వారి వచ్చిన తర్వాత నన్ను ఎన్నిమాటలంటారో, ఎందుక పంపావు వారిని అని...

[హారన్]

ఆమె : ఏంచేద్దాం, మా రేపూ ఇంకా ఒక నెల ఉందానా ఉంది. ఈ గ్రహచారం ఇలా వస్తుందని ఎవరు అను కొన్నారు...వస్తానండి. (చేతిపెట్టెతో సహా బయలు దేరుతుంది)

సీతమ్మ : (కూర్చుని) ఆఖరికి, శని తొలగింది, లక్ష్మమ్మ గారూ, పీడ విరగడైంది. బతికాను. విన్నారా మీరు... ఇంకా ఒక నెల ఉండి, నా ప్రాణాలు పిండాలనుకుందిట ఆమె! చేతుల్లో మూడుపైసలు లేవు; సొసైటీలో అరవై రూపాయలు అప్పు ... పిల్లకి కూడు నిండ పెట్టలేక రెక్కలు విరిగిపోయాయి....

లక్ష్మమ్మ : ఉశ్ శ్ ! మళ్ళా వచ్చారండీ.

సీతమ్మ : (లేచి) ఏమైనా మరిచిపోయారా ?

ఆమె : ఏమీలేదు...బయలుదేరిన గడియ బాగాలేదేమో, కాకి తంటాలు పెడుతూంది. ఒక పదినిమిషాలు ఆలస్యమవుతుంది అని అన్నారు...ఎందుకో భయమౌతున్నది సీతమ్మగారూ !

సీతమ్మ : అలాంటిమాటలు అనకండీ ! ఇంతమాత్రానికి భయమెందుకు ? నంజుండేశ్వరునికి దండుకళ్లు చేయించి

పంపండి...మీవారిని రైలులో వెళ్ళి సాయంకాలానికి ఊరుచేరి తంతి ఇవ్వమనండి. మీరందరూ ఉండండి... పిల్లాజెల్లా ఆటలాడిస్తూ...లలితు పాపం మీ పిల్లలతో మనసారా ఆడుకోనేలేదు ...

ఆమె : ఇంక నన్నుమళ్ళీ నిర్బంధంచేయకండి...ఇంతవరకు మేము మీకు కలిగించిన ఇబ్బందే చాలు.

[హారన్]

లక్షమ్మ : అదిగో పిలుస్తున్నట్టుఉంది, మిస్సమ్మల్నీ...వినండి హారన్ !

సీతమ్మ : ఇబ్బంది అన్నమాటే లేదు ... మీ అల్లుడి చికిత్స ఇక్కడే జరిగితే బాగుంటుంది. ఆపరేషను జరగాలంటే, దానికీ ఇక్కడ వైద్యులు ఉంటారు. పైసలు కున్నామనిస్తే, అలాటివారు ఇక్కడా దొరుకుతారు... ఇంతకూ నయంకావడం ముఖ్యం.

అమె : అంతా మీ మాటచలువ .... నయంకానీండి సీతమ్మగారూ ! నంజుండేశ్వరునికి కళ్లుచేయించి పంపుతాను....వస్తా...హారన్ చప్పుడు జోరైంది...వస్తా. ఈ ఉత్తరం రాకపోతే మేము ఈలాం వెళ్ళేవాళ్ళం కాదు సుమండీ !

సీతమ్మ : అందరూ జట్టుగా వచ్చి, నంజనగూడుకు స్వయంగా వెళ్ళి ఈశ్వరునికి సమర్పించమనండి... అదే మంచిది !

[ఆమె బయలుదేరుతుంది]

పాడైపోయింది !...విన్నారా, ఆమె మాటలు !

ఎలాఉంది, లక్షుమ్మగారూ!... నీళ్ళు కారూ! నీళ్ళ బడాయీ! నడిదారిని చెడి కూడుకుపోవాలి నీళ్ళకాను! ఒక్కనాడుకూడా లలితూను కూర్చోపెట్టలేదు దాంట్లో. తను వానరసైన్యంతో నింపడానికే స్థలంచాలదు. పాడుజనం ఎక్కడినుంచో వచ్చిపడి, నా ప్రాణాలు తినేశారు....వీళ్ళ అల్లుడి కళ్ళకు పుండ్లుపడితే, నాకేమిటి? ఏమో, ఉపచారానికని మంచిమాట అన్నాను. ఆ ఆడది...ఎలా పొంగిపోయిందో, చూశారా... లక్షుమ్మగారూ!

[హారన్]

లక్షుమ్మ : (లేచి నిలబడి) అదిగో! మళ్ళీ వచ్చారు కదమ్మా!

సీతమ్మ : (లేచి) ఎవరు! ఆమేనా! అయ్యో! నా తల రాత! మళ్ళీ వచ్చిందా!

లక్షుమ్మ : కూడా ఇంకెవరో ఒకరు.

సీతమ్మ : ఆ! ఏమన్నారు?

ఆమె : సీతమ్మగారూ! ఇదే సరసు. చంకలో పిల్లను ఎత్తుకొని, మొగుడితోపాటు ఇక్కడికే వచ్చివేసింది. మీ మాట ఫలించింది....ఇక్కడే కనిపించారు మూడు... ఆ బెంగళూరు డాక్టరుకు మైసూరుకు బదిలీ అయిందట... కాపుచేసుకొని ఇక్కడికే వచ్చారు...ఇంకేముంది, మీరు చెప్పినట్లు ఇక్కడే అందరం ఉండి, కళ్ళునయంచేసుకుని నంజుండేశ్వరుని దర్శనంచేసుకుని, కన్నంబాడికి వెళ్ళి, సిదానంగా వెళ్ళితే సరిపోతుంది....మా కింకేమిటి

బెంగళూరులో పని ?

[సీతమ్మ కిందికి కూలబడిపోతుంది.]

ఎందుకూ ? ఏమిటిది ? సరసూ ! పట్టుకోవే ఆవిణ్ని...

లక్ష్మమ్మ : (గాబరాపడి) సీతమ్మగారూ ...మంచినీళ్ళు తేనా ?

సీతమ్మ : (లోగొంతుకతో) హా !

ఆమె : (బెదరిపోయి) సరసూ పట్టుకోవే, ఆవిణ్ని... ట్రంకు, పరుపులు ఇంట్లోకి తెమ్మని చెబుతాను.

లక్ష్మమ్మ : ఏమండీ ? ఎలాఉందీ ఒంట్లో......

సీతమ్మ : (దీనస్వరంతో) నంజుండేశ్వరా.........!

( తెర )

# మా ఊరికి పశ్చిమాన

రచయిత:

## క్షీరసాగర

[ 'క్షీరసాగర' బి. సీతారామ శాస్త్రి — గారు కన్నడనాడులో మైసూరు ప్రాంతంలో విశేషంగా ప్రజలమనసుచూరగొన్న నాటక కర్తలు. వీరి పెక్కు నాటకాలు ప్రదర్శితమై ప్రజల మెప్పుకు పాత్ర మయాయి. లఘుహాస్యాన్ని నాటకీయ సన్నివేశంతో సరసంగా మేళవించే కళ 'క్షీరసాగర' గారికి సిద్ధించింది.

కాని, "మా ఊరికిపశ్చిమాన" అలాటిది కాదు. ఇది విషాదమయమైన గంభీర నాటిక.]

అ, ఆ, ఇ : ప్రవేశమార్గాలు

క : మంటిదిబ్బ

చ : వాగు

ట : ఎండినమాను;

రెండు వంకరకొమ్మలుంటాయి.

య ర ల వ :<br>శ ష స హ : స్థలసంకేతాలు

కాలం : సాయంకాలం దాటింది.

## పాత్రలు

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీనివాసులు | — | విద్యార్థి | వయస్సు | 18 |
| లింగన్న | — | కూలీ | ,, | 13 |
| తండ్రి | — | | ,, | 50 |
| తల్లి | — | | ,, | 45 |
| కూతురు | — | | ,, | 12 |

అగోచరవ్యక్తి [దిబ్బలో దాక్కొని వుంటాడు]

# మా ఊరికి పశ్చిమాన

[అగోచరవ్యక్తి (క) దిబ్బలో దాక్కొని ఉంటాడు.]

(తెర లేస్తుంది)

[శ్రీనివాసులు (అ) ప్రవేశం. శ్రీనివాసులు టార్చిలైటు పట్టుకొని ప్రవేశించి (అ), (శ) అనేచోట నిలబడి, చుట్టుపట్టుప్రదేశాలను టార్చిలైటు వెలుతురులో చూస్తుంటాడు.]

[లింగన్న (అ) ప్రవేశం. లింగన్న తలమీద పెట్టె, పరుపు మోసుకొనివచ్చి శ్రీనివాసులువెనుక నిలబడుతాడు.]

శ్రీనివాసులు : లింగన్నా, ఎటుచూచినా దారే కనిపించడంలేదు. ఎవరైనా కంటబడుతారేమోఅంటే ఎక్కడా మనుష్యుల అలికిడే లేదు. ఈ అడవిలో, ఈ తుంపరలో, ఈ రాత్రల్లా అటమటించేగతి వచ్చింది కదా !

లింగన్న : మ మద్దేన్నం బైల్దేరిన గడీలు ఎట్టుండాయో ఏమో దొరా! బైల్దేరేప్పుడే యెందొకో యేమో యెడ్మ కన్ను అదరినట్టయింది. దాన్కి సరిగ్గా దారేతప్పి పోయాం దొరా.

శ్రీనివాసులు : నాకూ ఎందుకో ఎడమకన్ను అదురుతూనేఉంది.

లింగన్న : (విని) అదేంది దొరా, సద్దు 'మ్రర్ ర్ర్' అని ?

శ్రీని : (విని) ఇక్కడెక్కడో నీళ్ళు పారుతున్నట్టుంది.

కొంచెం తాళు, చూసుకొని వస్తాను. (వా. వద్దకు వెళ్ళి టార్చ్ వేసి చూచి) ...వాగు! నిండిపారుతూ ఉంది!! (శ్రీ. వద్దకు వచ్చి) ఇది వాగుగట్టు. వాగు గట్టున ఎక్కడికో వచ్చాము

లింగన్న : ఏంచేయాలి దొరా ఇప్పు ?

శ్రీని : ఏమి చేయాలో, ఏమో! ఏమీ తోచడంలేదు. నడిచి నడిచి చాలైపోయింది. ఆ దారిలోని రాయి విసుపుకున్న నొప్పి వేగే వస్తూవస్తూ ఎక్కువవుతున్నది. ఎక్కడయినా కొంతసేపు కూర్చుంటాను, వాన చినుకులుకూడా తగ్గాయి.

లింగన్న : అలాగే కానీ దొరా !

శ్రీని : ఇక్కడ ఏదో మంటిదిబ్బ ఉన్నట్టుంది. (దిబ్బ దగ్గరికి వెళ్ళి) ...ఔను. మంటికట్ట...ఇక్కడ కూర్చుందాము రా. నీవూ అలసిపోయావు. పాపం, ఇంకా పసివాడివి. పెట్టె, పక్కా వేగే మోస్తున్నావు. పెట్టె ఇక్కడ దింపు. కూర్చో...పెట్టె దించనా ?

లింగన్న : పరవాలేదు, మీరు కూర్చోండి దొరా. నేనంతా దింపుకుంటాను.

[శ్రీనివాసులు దిబ్బమీద ల. అనేచోట కూర్చుంటాడు. లింగన్న దిబ్బమీద శ్రీనివాసులు ప్రక్కన ప. అనేచోట పెట్టె, ప్రక్క పెట్టి, దిబ్బ మీద య. అనేచోట కూచుంటాడు.]

శ్రీని : లింగన్నా, ఇలాంటి ప్రయాణం నే నెప్పుడూ చేయలేదు. చూడు, బెంగుళూరునుంచి నిన్న రాత్రి బయలుదేరిన వాణ్ణి నేను. ఆరంభంలో రైలు బయలుదేరడమే రెండు

గంటలు ఆలస్యమైంది. తర్వాత దారిలో దానిమిషను చెడిపోయి మా స్టేషనుకు ఉదయం ఆరుగంటలకు రావలసిన రైలు మధ్యాహ్నం రెండుగంటలకు వచ్చింది. అక్కడ కూలీలు దొరకడమే కష్టమైపోయి, కొసకి నిన్ను ఏర్పాటుచేసుకొని బయలుదేరేవేళకు మూడుకొట్టారు. స్టేషనునుంచి మా పల్లెకు ఆరేడుమైళ్ళు ఉండవచ్చు. సాధారణంగా సాయంకాలం ఐదుగంటలవేళకు పల్లెకు చేరుకోవచ్చు. అలాటిది వానలోచిక్కుకొని, దారితప్పి రాత్రిఎనిమిదిగంటలయినా ఇంకా అడవిలోనే ఉన్నాము.

లింగన్న:- ఆ గట్టుమీద ఎడంవేపున పోవాల్సివుండేదో ఏమో దొరా. నేనూ ఈ దారి ఎన్నడూ చూచినోణ్ని కాను. ఇంత బోటికగాఉన్నకాడినుంచి ఆ రైలుటేసన్ లోనే పనిచేస్కుంటున్నాను. అటూ ఇటూ పోలేదు. ఈయాళేనండి మీయెంట కూలికి రావటం ఇటువేపు.

శ్రీని:- నాకూ ఇటీవల ఈ దారి అంత గుర్తులేదు. మొదలే అడివిదారి. వంతెన, కళ్ళీచెట్లవరస, ఇలాటిగుర్తులమీద వెళ్ళాలి. ఇంతకూ నే నిక్కడికిరావడం సంవత్సరానికొకసారి — బెంగుళూరులో క్లాసు ముగిసి, పరీక్షఅయి, వేసంగిసెలవులు వచ్చినప్పుడుమాత్రం ఒకసంవత్సరం లోపల ఇక్కడిగుర్తులు ఎంతో మారిపోయిఉంటాయి. నాకు అంత జ్ఞాపకంఉండదు.

లింగన్న : ఓ, బెంగుళూర్లో యీళకు సదువుకొంటూ గచ్చు నేలమీంద అల్లాగే వారాడుకొంటున్నారు పాపం!...

ఏంటీ, పల్లెలో మీ పొలం పుట్రా, ఇల్లూ వాకిలీ ఉన్నయ్యా దొరా !

శ్రీని : (ఉత్సాహంతో) ఇది మా ఊరోచ్. మా పొలం, ఇల్లు, అమ్మ, నాన్న, తమ్ముడు, చెల్లెలు అంతా ఇక్కడే ఉండడం. నేనుమాత్రం చదువుకోసం దూరం వెళ్ళేను. అంతేనోయ్ !

లింగన్న : ఈయాళ మీరు రావటం మీవాళ్ళకు తెల్సా దొరా ?

శ్రీని : వస్తానని తెలుసు. ఈరోజే వస్తానని తెలీదు.

లింగన్న : ఈయాళ రావటం వాళ్ళకు తెలుసుంటే, ఎవ రైనా టేసన్ కాడికి పంపేవాళ్ళే.

శ్రీని : ఫరవాలేదు. పిల్లవాడివైనా చాల అనుభవశాలిలాగ మాట్లాడుతావు. బుద్ధిమంతుడివి...నీ కిప్పుడు ఎన్నేళ్ళు లింగన్నా ?

లింగన్న : చూడండి దొరా, మా వూళ్లో గుడిముందుండిన ఆ దొడ్డ గరుడగంబం వాలిపోయింది సూడండి... ఆ యేడు పుట్టినోణ్ణి నేను—పన్నెండో, పదేనో యేళ్ళు అయ్యుండాలి కదూ దొరా ?

శ్రీని : (చిరునవ్వుతో) మీవూరు ఏదో, గుడిఏదో, గరుడ గంబం ఏదో, అది ఎంత ఎత్తు ఉండేదో, ఎప్పుడు వాలి పోయిందో—నా కేమి తెలుసు లింగన్నా ? ఇంతకూ మీవూళ్లో ఒక గుడి ఉంది, దానిఎదుట ఒక పెద్ద గరుడ గంబం ఉంది. అది వెనుక ఎప్పుడో ఏదో సంవత్సరం వాలింది. ఆ సంవత్సరం పుట్టినవాడివి కదూ నువ్వు ?

లింగన్న: ఔనండి దొరా. అదే సంవత్సరం. ఇప్పటికి ఎన్నేళ్ళయింది దొరా?

శ్రీని : నిన్ను చూస్తే పదమూడేళ్ళు అని చెప్పవచ్చు.

లింగన్న : సరే, దొరా.

శ్రీని : ఇంకా చిన్నవయస్సు పాపం! ఈ దినం చాల శ్రమ అయింది నీకు లింగన్నా. ఇంతదూరం నడిచావు, ఈ పెట్టె మోసుకొని.

లింగన్న: పెట్టె యేమీ బరువు లేదు దొరా. చూడ్డానికేమో పెద్దదిగా వున్నది. అయితే, శానా తేలిక. దీంట్లో సామానేమీ జాస్తీ ఉన్నట్టు లేదండీ.

శ్రీని: భారమైనదేమీ లేదు. ఒక పుస్తకం, నాలుగు చొక్కాలు నా తమ్మునికొక జలతారు టోపి, ఒక జత బూడ్సులు, నా చెల్లెలికి ఒకజత బొమ్మలు—అంతే.

లింగన్న : జల్తార్ టోపీ బెంగ్లూరునుంచి తెచ్చిందన్న మీద, మా బాగా వుండాలి దొరా.

శ్రీని : ఇదో చూడు. (పెట్టెనుంచి టోపీ తీసి అందిస్తాడు. లింగన్న దానిని టార్చిలైటు వెలుతురులో చూస్తాడు.)

లింగన్న : ఘనంగా ఉన్నది దొరా... మీ తమ్ముడుగారు ఇంకా సిన్నోరయ్యుండాలి. అందుకే సిన్నది తెచ్చారు.

శ్రీని : (ఉత్సాహంతో తనలో తానే మాట్లాడుకొంటు న్నట్టు) వానికింకా ఆరేడు సంవత్సరాలు... ధోర... ధోర కొడుకులాగ ఉంటాడు! ఊళ్ళోవారికంతా అచ్చు మెచ్చు. నన్ను చూస్తే ప్రాణం వాడికి! ఇప్పుడు ఇంటికి పోతూనే

పరిగెత్తివస్తాడు, చుస్తూఉండు—"అన్నా, శ్రీరంగపట్ట ణంకథ చెప్పా" అని.

లింగన్న : అదేంకత సెప్పండి దొరా. మీరుగూ అలసట తీస్కుకొన్నట్టూ వుంటాది. నాకు కతలు వినాలంటే శానా ఆశ. దినం ఈయాళకు కతసెప్తాడు మా తాతయ్య.

శ్రీని : అలాఅయితే నీనే ఒకకథ చెప్పు. (టార్చిని పెట్టెలో దాస్తాడు.)

లింగన్న : నాకు కతలూ గితలూ సెప్పడం తెలీకాదండీ; నట్టి ఇనడమే సురి.

శ్రీని : అలాఅయితే నేనే చెబుతా విను...శ్రీరంగపట్టణం కథ చెప్పనా?

అగోచరవ్యక్తి : (దిబ్బలోనుంచి గట్టిగా) ఊహూం...ఊహూం...

లింగన్న : (భయంతో లేచి) ఎవరో వూంగొట్టినట్టయింది దొరా.

శ్రీని : (అనుమానంతో లేచి) నీవేకదో ఏమ్ ఊగొట్టింది ?

లింగన్న : కాదండీ దొరా ! మనం కూచున్న యీ దిబ్బ లోంచి ఎవరో వూంగొట్టినట్టయినాది.

శ్రీని : ఎక్కడైనా ఇలాఉంటుందా ?...ఏమిటో, పోనీలే, కూచో. (కూచ్చుంటాడు) శ్రీరంగపట్టణం పేరు విన్నా వటోయ్ లింగన్నా ?

లింగన్న : మైసూరుకాడ... నదిచుట్టుకొని వున్నాదంటకదూ అయ్యూర్యాదు దొరా ?

శ్రీని : ఊం, ఆ వూరే...ఇప్పటికి నూటాయాభై సంవత్స

రాలకింద... అక్కడ... టిప్పుసుల్తాను దౌలత్ చేస్తూ ఉండేవారు—దౌలత్.

లింగన్న : తురకలా దొరా ?

శ్రీని : ఔను...అప్పుడు ఇంగ్లీషువారిసైన్యం వచ్చి, ఆ ఊరిని ముట్టడించింది.

లింగన్న : నది ?

శ్రీని : నదిదాటుకొని వచ్చారోయ్ !

లింగన్న : సరి సరి, నదిదాటి వూళ్లోకి జొరబడ్డారు అనండి.

శ్రీని : కాదోయ్. ముట్టడించారోయ్ — అంటే, కోట చుట్టూ ముసురుకున్నారన్నమాట.

లింగన్న : క్వాట వుండేదా దొరా ఆ ఊరికాడ ?

శ్రీని : ఓహో! నీకు అదే తెలీదా ? కోట ఉండేది. దానిలోకొంతభాగం ఇప్పుడూ ఉందిలే. ఆ సైన్యం ముట్టడించినప్పుడు సుల్తాను కోటతలుపులు మూయించేశారు.

లింగన్న : అలాఅయితే, వాళ్ళు లోపట, వీళ్ళు వెలుపట! అప్నుడు యింకేమిటి క్వాట పగలగొట్టి లోనికి యెళ్లాల. లేదూ, దానిమీద యెక్కి యెళ్ళాల.

శ్రీని : ఆఁ, చూడు. బుద్ధిమంతుడివి నువ్వు. ఇంగ్లీషువారు ఆ రెండుపనుఃలూ చేశారు. (పౌరుషంతో) ఒకవైపు కోట యెక్కేశారు... కోటయెక్కి, యుద్ధంచేసి, బావుటా ఎక్కించేశారు కోటమీద.

అగోచరవ్యక్తి : (మునుపటిలాగ) ఉహూఁ.

(ఇద్దరూ తటాలున లేచి ఇవతలికి వస్తారు.)

లింగన్న : ఈసారి సక్కగా యిసబడిందికదా దొరా పూంగొట్టింది ?

శ్రీని : ఉండు, చూద్దాం... (టార్చిలైటుపట్టుకొని దిబ్బ చుట్టూ చూచివచ్చి) ఎవరూలేరే. ఇదేమి టాశ్చర్యం! ! వట్టి భ్రాంతోయ్ లింగన్నా, ఇంకేమీలేదు, వట్టి భ్రాంతి.

లింగన్న : అంతేనంటారా దొరా ?

శ్రీని : అంతే, అంతే... ఎలాగయినాకానీ కథ త్వరగా ముగించి బయలుదేరుదాం రా. (ఇద్దరూ కూచుంటారు.) ఎంతవరకూ చెప్పాను ?

లింగన్న : క్వోటమీద బావుటాఎక్కించారు.

శ్రీని : (కనికరంచూపుతూ) అప్పుడు, సుల్తాను భోజనం చేస్తూఉన్నారు.

లింగన్న : పాపం !

శ్రీని : వార్తవినంగానే భోజనంమానేశారు.

లింగన్న : ఇంకేంభోజనం దొరా, అల్లాంటివేళ ?

శ్రీని : (ఆవేశంతో) గుఱ్ఱమెక్కి, కత్తిపట్టుకుని, హుటాహుటిగా బయలుదేరారు.

లింగన్న : సుల్తానువారా ఖుద్దున ?

శ్రీని : ఊఁ, తామే దూకారు. (పరాక్రమంతో) దూకి, యుద్ధంచేసి...(దుఃఖంతో) గాయపడిపోయారు. శవాల మధ్య.

లింగన్న : అహాహాహా, ఎలాంటిమాట దొరా !

శ్రీని : ఆమీాదట ఒక ఇంగ్లీషుసిపాయి వచ్చి, వారి బం గారుపట్కాపై చేయివేశాడు.

లింగన్న : వో! బంగారందని ఆసపడ్డాడులేండి దొరా!

శ్రీని : (కోపంతో) సుల్తాను కత్తివిసిరాదు.

లింగన్న : అల్లాఅయితే యింకా జీవం వున్నాదనండి.

శ్రీని : అల్పం స్వల్పం వుంది...(క్షీణస్వరంతో) అప్పుడు ఆ సిపాయికి కోపంవచ్చి...కొట్టి చంపివేశాడు.

లింగన్న : శివశివా!

శ్రీని : రాత్రివేళకు ఇంగ్లీషువారు ఊళ్ళో జొరబడ్డారు.

లింగన్న : అరరె, ఫౌజు ఊళ్లో జొరబడితే, జనంగతేమి దొరా?

శ్రీని : అదేమి అడుగుతావు! రాత్రంతా వీధుల్లో ఏడుస్తూ అల్లాడిపోయింది జనం...ఇంగ్లీషుసేనాపతులు దివటీల వెలుతురులో సుల్తానుశవం వెదికించి, ఉదయం రాజ మర్యాదలతో సమాధిచేయించారు. మర్యాదతెలిసిన వారు ఎంతైనా...

అగోచరవ్యక్తి : (మునుపటిలాగ) ఉహుఁ! (ఇద్దరూ వెం టనే లేచి ఒకరిముఖంఒకరు చూచుకుంటారు.)

లింగన్న : మూాడోసారి దొరా ఇది.

శ్రీని : (తలఊపుతూ) ఔను...మూాడోసారి.

[తెరవెనుక గూబ కూస్తుంది]

గుహు, గుహు హు హు హు హు, గూ ...గూ...

లింగన్న : అదేంది దొరా కూసేది?

శ్రీని : ఏదో పక్షి...గూబ అయివుంటుంది. ఊగొట్టిందీ

అదే కావచ్చు. ఒక్కొక్కప్పుడు దానిధ్వని అలా ఉండడమూ కద్దు.

లింగన్న : కాదు దొరా. పూంగొట్టింది ఈ దిబ్బలో... యేమైనాకాని, యీ జాగ మంచిదికాదు, పోదాం పదండి దొరా.

శ్రీని : పెట్టితీసుకో.

లింగన్న : (పక్క, పెట్టెమోసుకొని వ. అనేచోట నిలబడి భయంతో చుట్టూచూస్తూ, ట. వైపు వేలుచూపి) అదేంది దొరా అక్కడ కనిపించేది ?

శ్రీని : ఏదీ ? ఎక్కడ ? (టార్చిపట్టుకొని) ... అదొక మానోయ్... తెలిసింది.

లింగన్న : మాను యెక్కడైనా అల్లావుంటుందా? ఎల్లాంటి మాను దొరా ?

శ్రీని : ఎలాటి మానో... అడివిమాను. ఎండిపోయి రెండు కొమ్మలుమాత్రం వంకరగా నిలిచాయి. ఆ మాను నాకు బాగా తెలుసు. ఇక్కడినుంచిదగ్గరే మాన్పూను... ఆ మాను చూచి నా తమ్ముడు శ్యాము భయపడ్డాడు నిరుడు.

లింగన్న : వాళ్ళు యిక్కడికి ఎందుకు వచ్చారు దొరా ? దారి తప్పిందా ?

శ్రీని : నిరుడు వేసవిలో ఒకసాయంకాలం వాణ్ణి పిలుచుకొని పికారుబయలు దేరాను. గోపుతో శ్రీరంగపట్టణం కథ చెప్పు అన్నాడు. అదంటే చాలాఇష్టం వాడికి. కథ చెబుతూ ఇక్కడికి వచ్చేశాను. ఆ దినం ఈ చెట్టుగూర్చి,

వాడు భయపడ్డాడు. దోవతప్పింది. ఎలాగో ఇంటికి వెళ్ళాము. ఆమీదట వానికి మూడురోజులు జ్వరం పట్టుకుంది.

లింగన్న : యిక్కణ్ణుంచి మీవూరు యెంతదూరం దొరా ?

శ్రీని : ఒక మైలులోపే. ఇదే మా ఊరి శ్మశా...

లింగన్న : (చాలభయంతో) యేంది దొరా, మసాణమా?

శ్రీని : ఏమీలేదు...ఇంకా కొంచెం ముందు ఎడమవైపు తిరుగవలసిఉంటుంది అన్నాను, అంతేనోయ్. ఈ మాను మా ఊరుకి పశ్చిమాన ఉంది.

[తెరలో పెద్ద కుక్క అరుస్తుంది]

వౌ వౌ వౌ...బౌ...వౌ వౌ.

శ్రీని : అదో ఆ పెద్దకుక్క అరుస్తున్నదే, అదే మాఊరు... (ఒక అడుగువేసి నొప్పి అభినయిస్తూ) ... లింగన్నా, కాల్లో రాతిముక్కఇరుక్కుందో ఏమో, చాలా నొప్పి. ఈ టార్చి కొంచెం పట్టుకో చూద్దాం. (ఇద్దరూ నేల మీద కూచుంటారు. లింగన్న పెట్టెదింపి టార్చివేసి చూపుతాడు. శ్రీనివాసులు అరకాలు నొక్కుకుంటూ చూస్తూఉంటాడు.

[ప్రవేశం (ఇ): తల్లి, కూతురు. తల్లి నీలాంజనాలను (దీపారాధనదీపాలు), కూతురు పాలపాత్రను చేత్తోపట్టుకుని ఉంటారు. తల్లి వ. అనేచోట కూచుని దిబ్బమీద అటుపక్క ఇటుపక్క దీపాలు వెలిగిస్తుంది. కూతురు స. అనేచోట నిలబడిఉంటుంది. ఇద్దరూ మౌనంగా దుఃఖపడుతూఉంటారు. ఇదంతా శ్రీనివాసులు, లింగన్న చూడరు.]

శ్రీని : కాలులో ఇప్పుడేమీ కనిపించదులే; పగలు

చూడాలి...నింపాదిగా వెళదాం, లే. (ఇద్దరూ లేచి, వెళ్ళడానికి సిద్ధమౌతారు.)

లింగన్న : (వెనక్కు తిరిగి తల్లి, కూతుళ్ళను చూచి, భయంతో వణికిపోతూ, మెల్లిగా) అక్కడ చూడండి దొరా !......

శ్రీని : (చూచి, భయంతో లింగన్న చేయి పట్టుకొని, వానిని వా. అనేచోటికి తీసుకువెళ్ళి నిలబడి, కొంచెం సేపు మౌనంతో చూచి, నెమ్మదిగా) లింగన్నా, నీ కేమిటి కనిపిస్తూందోయ్ ?

లింగన్న : (నెమ్మదిగా) సూడండి దొరా...దీపాలు... అటూ, ఇటూ...

శ్రీని : (నెమ్మదిగా) భయపడకు. చూద్దాం.

లింగన్న : (ఆ వైపు వేలుచూపి నెమ్మదిగా) ఆడ సూడండి దొరా, దూరాన మరోదీపం ఆడేది.

శ్రీని : ఔను. నాకూ కనిపిస్తూన్నది.

తల్లి : (రోదిస్తుంది) అయ్యో, నా తండ్రీ...(శ్రీనివాసులు వింటాడు; లింగన్న అతని వెనుక నక్కి నిలబడుతాడు.) పాలుకోరి పోయావుకదరా నాయనా! (పాత్రనుపంచి పాలు కొంచెంకొంచెంగా దిబ్బమీద పోస్తూ) తాగరా తండ్రీ, పాలుపోస్తాను, తాగరా నందనా...దినదినానికీ నవిసి కరిగిపోయావుకదరా...ప్రాణాలు తగసిపోయేటప్పుడు ఏదో మాట్లాడాలనుకుని, నాలుకరాక, నా ముఖంమే చూచావు. నా అప్పా, ఏమి అడగాలనుకున్నావో ? నీ కళ్ళలో మమ్మల్ని విడిచిపోనిసంకటం చూపావు. కంటా

కందయ్యా (గట్టిగా) ఈ అరణ్యంలో ఒంటిగా పడు కున్నావు కదరా... (సమాధిమీద పడుతుంది.)

శ్రీని : (నెమ్మదిగా) ఎవరో ఏడుస్తున్నారు, భయపడకు.

కూతురు : (తల్లిని పైకిలేపుతూ) అన్నకు జాబ్రాయడా నికీ కాలేదు. రెండోరోజే ఇలా అయిపోయింది. (దుఃఖ పడుతుంది.)

[ఇదిచూచి శ్రీనివాసులు సమాధిదగ్గరికి వెళ్ళబోతాడు. లింగన్న వానిని వెనక్కులాగి పట్టుకుంటాడు.]

[ప్రవేశం (అ): తండ్రి. తండ్రి చేత్తో టార్చి (లేక చేతిలాం తరు) పట్టుకుని ప్రవేశిస్తాడు. ]

తండ్రి : (స. అనేచోట నిలుచుని కొంచెంసేపు మౌనంగా సమాధిని చూచి, తర్వాత గద్గదకంఠంతో) ఏమి టీ వెర్రి? రాత్రివేళ ఇలావస్తే ఎలా? పోయినవాడు తిరిగి వస్తాడా? రాండి ఇంటికి...(దుఃఖం)

తల్లి : చీకటి అంటే భయపడేవాడివి; ఇప్పుడు ఇక్కడ ఒక్క డివే పడుకున్నావుగదరా అబ్బాయీ...అప్పుడు నీకు ఇదేస్థలంలో భయపడి...జ్వరంతగిలిందికదూ? ఇప్పుడు ఇక్కడ ఒక్కడివి పడుకుంటే భయంలేదూ ? ఇక్కడ నిన్ను ఒక్కణ్ణే వదలిపెట్టి ఇంటికి ఎలావెళ్ళను ?

కూతురు : అన్నయ్య వస్తాడు; టోపి, బూడ్సులు తెస్తాడు; శ్రీరంగపట్టణంకథ చెబుతాడు — అని గునిసేవాడు శ్యాము. అన్నయ్య ఇప్పుడు వస్తే ఎంత సంకటపడాలి !

(కళ్ళు తుడుచుకుంటుంది. శ్రీనివాసులు ఉద్వేగంతో సమాధిదగ్గరికి వస్తాడు.

తండ్రి : (దీపంఎత్తిపట్టి చూచి) ఎవరూ ?

శ్రీని : (గద్గదకంఠంతో) నాన్నా...

తండ్రి : (ఉద్వేగంతో) శీనూ (ముఖం కిందికివంచి దుఃఖిస్తూ నిలబడుతాడు)

తల్లి : శీనూ...(అంటూ లేచివచ్చి శ్రీనివాసులుభుజంపై ముఖంఆనించి దుఃఖిస్తుంది.)

కూతురు : అన్నయ్యా, శ్యామూ చూడు ఇక్కడపడు కున్నాడు...(ఏడ్పు) (శ్రీనివాసులు సమాధిని కౌగిలించు కొని కన్నీరు కురిపిస్తాడు. ఒక్కొక్కరు ఒక్కొక్క పక్క దుఃఖపడుతూఉంటారు.)

లింగన్న : శివశివా ! ఇది సూడటానికి సాద్యెంకాదు. (కూర్చొని, చేతుల్లో తలపెట్టుకుంటాడు )

శ్రీని : శ్యామూ, లేకుండాపోయావా?...ఈ చెట్లూ, మానూ అన్నీ రాత్రిళ్ళు ఒంటిగా ఎలావుంటాయని అడిగేవాడివికదూ?...ఇప్పుడు నువ్వే ఇక్కడ ఒంటిగా పడుకున్నావా? శ్యామూ...శ్యామూ...

తండ్రి : (కొంచెం మనస్సు కుదుటబరచుకొని) ఈసారి రెండువారాలనుంచి జ్వరం. మొన్నమధ్యాహ్నం ఉన్న దున్నట్టుగానే ఎక్కువై, నిన్న పోనేపోయాడు.

తల్లి : పోనేపోయాడు, సీనూ, మనల్నందరినీ వదలి పోనే పోయాడు!

కూతురు : నీవు వస్తావని కాచుకూర్చున్నవాడు, నీవు వచ్చే లోగానే పోయాడు. శ్రీరంగపట్టణంకథ విందామనుకున్నాడు; టోపీ, బూడ్సులుకోసం ఎదురుచూచాడు... అయ్యో, వెళ్ళిపోయాడు.

శ్రీని : శ్రీరంగపట్టణంకథ విన్నాడు...ఇవ్వాడేకదూ ఇక్కడే కూచుని నేనే చెప్పాను; లోపలినుంచి వాడు ఊకొట్టాడు; ఔను, ఊఁగొట్టినవాడు వాడే...ఇక ఈ టోపీ బూడ్సులు ఉంచుకోక్యామూ. (టోపీ, బూడ్సులు తెచ్చి సమాధిమీద అటు ఇటు పెట్టి, జేబురుమాలుతో కన్నీళ్ళుతుడుచుకుంటూ నిలబడుతాడు.)

తల్లి : అయ్యో! ఈ టోపీ, బూడ్సులు తొడిగిచూచేపుణ్యం లేకపోయింది. హాయ్, హాయ్, ఈ సంకటం ఎన్నటికి ఆరీని?

తండ్రి : భగవంతునికే తెలుసు...ముఖ్యంగా అలాటి అబ్బాయి దక్కేభాగ్యం మనం పొందలేదు...అంతా దైవేచ్ఛ...ఏదీ శాశ్వతంకాదు ... అందరూ ఏదోఒక దినం ఇక్కడికి వచ్చేవారేకదా! మానవజీవితం ఒక విచిత్రనాటకం. దానిలో తెరపడేవరకు కథసాగుతుంది. అలాగే కథముగిసేలోపుగానే తెరపడిపోవచ్చు.

శ్రీని : తెర మనచేతుల్లో లేదు.

తండ్రి: మనచేతుల్లో ఏదిమాత్రంవుంది? ఇక ఇంటికి వెళదాం లేవండి.

శ్రీని : (వ. అనే చోటికి వచ్చి తనలో) ఇంటికిపోదామా? ఇంటికి! ఏది యిల్లు? అదా ఇదా? అది నాలుగునాళ్ళ యిల్లు! ఇదే శాశ్వతమైనయిల్లు. ఇదేకదూ దైవలీల!

[అందరూ నెమ్మదిగా ఆ. అనేప్రదేశంపైపు నడచిపోతూ వుంటారు. లింగన్న పెట్టి, పక్కలతోసహా వెంటవస్తాడు. తల్లి మరొక మారు ఉద్వేగంతో వెనక్కు తిరిగివచ్చి సమాధిపై పడుతుంది. తండ్రీ, కూతురూ, ఆమెను లేపి అటుఒకరు, ఇటుఒకరు పట్టుకొని మెల్లిగా తీసుకుని పోతూవుంటారు.]

[తెరపడుతుంది]